



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

వ్యవస్థాపక సంపాదకులు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 14 | రాజమహేంద్రవరము 16-11-1991, 1-12-1991 | సంచికలు 22, 2


## —. ఈ సంచికలో రచయితలు .—

1. శ్రీ ఆవంత్స సోమసుందర్
2. డా॥ రామడుగు వెంకటేశ్వరశర్మ
3. డా॥ ఆర్. అన్నపూర్ణ
4. శ్రీ ఖండాపు మన్మథరావు
5. డా॥ మిరియాల రామకృష్ణ
6. డా॥ ఎన్. గోపాలకృష్ణమూర్తి
7. శ్రీ పాటూరి రఘురామయ్య
8. డా॥ పొన్నా లీలావతమ్మ
9. శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్
10. డా॥ నండూరి వేంకటసత్యరామారావు
11. డా॥ టి. బాలసుబ్బయ్య
12. శ్రీ కె. ఎస్. సత్యనారాయణమూర్తి
13. శ్రీ చిర్రావూరి శ్రీరామశర్మ


1, 16 తేదీలలో ప్రచురింపబడును.

సంవత్సర చందా రు. 20-00 | 6 మాసములకు రు. 12-00 | విడి ప్రతి రు. 2.0


—— సకాలంలో చందా పంపి సహకరించండి.

# సంపాదకుని మాట

పరీక్షావిధానం లోపరహితంగా ఉన్నపుడే ఆ పరీక్షకు అర్థం, విలువ ఉంటాయి. మన దేశంలోనేకాదు రాష్ట్రంలోకూడా ఒక్కొక్క విశ్వవిద్యాలయ పరిధికి ఒక్కొక్క రకంగా పరీక్షావిధానం ఉన్నది. సంస్కరణల పేరుతో జరిగే మార్పులు అనేక 'మార్పు'లకు లోనై అపహాస్యం పాలయ్యేవిధంగా ఉంటున్నాయి వీటివల్ల విద్యార్థులు నష్టపోతున్నారు. ఈ పరీక్షావిధానాలకే 'విలువ' ఉంటే మళ్ళీమళ్ళీ 'ఎంట్రన్సు' పరీక్షలు ఎందుకు? 'ఎంట్రన్సు కోచింగు'లు తల్లిదండ్రులకు, ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబీకులకు మోయలేని భారమై పోతున్నాయి చివరికిదొక వేలంవెర్రిగా తయారై స్వార్థశక్తులకు ఆర్థికలాభాలను కూర్చిపెట్టే వ్యాపారంగా మారింది. పరీక్షావిధానాలు సరియైన పద్ధతిలో పెట్టి నీతి కొక 'విశ్వవిద్యాలయం' ఏర్పడే పరిస్థితిని చక్కదిద్దినప్పుడే విద్యారంగం మళ్ళీ కొత్త ఊపిరి పోసుకుంటుంది. అధికారంలో ఉన్న వ్యక్తుల ఇలానాలకు విధాన నిర్ణయాలు సాధనాలుగా ఉండకూడదు. పరీక్షలు ప్రకటించడం, వాటిని వాయిదాలు వేస్తుండడం హడావుడిగా ఫలితాలు ప్రకటించడం అనేకరకమైన దుష్పరిణామాలకు దారితీసి చివరకు 'వ్యవస్థ' ఛిన్నాభిన్నమయ్యే ప్రమాదం ఉంది. మేధావులు ఈ విషయం గ్రహించి 'వ్యవస్థను' కాపాడుట అత్యంత ముఖ్యమైన విషయము. 'అక్షర జ్ఞానం'వల్ల ఏవో అక్షరాలు వస్తే సరిపోదు. ఆ అక్షరాలు వెలుగు దివ్వెలై సభ్యతను, సంస్కారాన్ని కలిగించినప్పుడే వాటికి సార్థకత ఉంటుంది.

—సంపాదకుడు

చందాదారులు సకాలంలో వారి చందాలను చెల్లించకోరుచున్నాము. చందా పూర్తియైన వెంటనే తిరిగి చందా చెల్లించవలసిన నైతిక బాధ్యత వారికుందని సవినయంగా మనవిచేస్తున్నాము. సరియైన చిరునామా పిన్ కోడ్ తోసహా తెలియపరచవలసినదిగా కోరుచున్నాము.

వార్షిక సంపుటాలు ఒక్కొక్కటి రు. 30 లు. 35 రూపాయలు మనీఆర్డరుగా పంపినవారికి వార్షిక సంపుటం రిజిష్టర్డు బుక్ పోస్టులో పంపబడుతుంది.

—సంపాదకుడు

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

వ్యవస్థాపక సంపాదకులు విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

Retired Telugu Lecturer, V T. J. College, Rajahmundry.

# తెలుగు సాంస్కృతిక జీవనంలో ఆధునికతా వికాసం

— శ్రీ అవంత్స సోమసుందర్

'కాలం మారింది!' అనే మాట మన దేశంలో కొన్ని దశాబ్దాలుగా వినిపిస్తోంది. ఈమాటను మనవాళ్ళు సాధారణంగా బాధాభివ్యక్తిగానే ఉపయోగిస్తూంటారు. 'మంచికాలం ఎప్పుడో అంతరించి పోయిందనీ, చెడుకాలమూ 'పిదప' కాలమూ దాపురించిందనీ'- ఈమాటకు అర్థాన్ని ఉద్దేశిస్తూంటారు. దీనికి ప్రత్యామ్నాయంగా కొందరు తెలివైనవాళ్ళు- 'మారింది కాలంకాదు, మనుషులే!' అంటూ ప్రతిపాదిస్తూంటారు. మొత్తానికి సందర్భంలో కాలం అనేపదం. వర్తమాన సమాజగమన వైలక్షణ్యాన్నే చిత్రిస్తోందన్న సత్యాన్ని మరువకూడదు.

కాలంలో.లేదాసమాజంలో ఈమార్పు ఎలావచ్చిందో మాత్రం వారువివరించారు దానికి కారణం ఆ మార్పుపట్ల వారికెంత మాత్రం సుముఖ భావం లేకపోవడమే! సరిగదా వారికి ఉక్కిరి బిక్కిరి చేసేబాధే గుండెలనిండా మిగులుతుంది. వారికా మార్పు ఎంతమాత్రం ఇష్టంలేదు. అలా ,ని వారించడం సాధ్యంకాదు. అందుకే ఉక్కిరి బిక్కిరవు తూంటారు పైగా 'ఈకాలం మారింది' అనే పదబంధాన్ని మంచిని చూడలేని అడ్డుపారగా ఉపయోగించుకుంటారు. అలాగని మారిన కాలం సమకూర్చిన సౌకర్యాలు వినియోగించు కోరా అంటే అదీలేదు. కాని సమాజంలో అనుస్యూతంగా వ్యాపిస్తూనే ఉన్న భ్రష్టాచారాల్నే, దొంగబుద్ధుల్నే అవినీతుల్నే ప్రధమగణ్యాలుగాభావించి వారు నిందిస్తూ ఉంటారు. మూకుమ్మడిగా ప్రజలంతా అన్యాయపరులైపోయారనీ పాపం వ్యాపించి పోయిందనీ. ఇతరుల కన్యాయం చేయడానికి ఎవ్వరూ సందేహించడం లేదనీ, ఈ దుఃఖభాజనులువిపరీతంగా బాధపడి పోతుంటారు ప్రజలేమారారు అనేవారి మాటకు వారి వ్యాఖ్యానం ప్రజలంతా చెడిపోయారనే! మరికొందరు గడుసు వాళ్ళు తామే స్వయంగా భ్రష్టాచారులే అయినా- దొంగే 'దొంగ దొంగ అని అరుస్తూ పారిపోయిన రీతిగా పరికల్పిస్తూంటారు.

మనదేశంలో బహుశా ఈమాట ఇరవయ్యో శతాబ్ది ఆరంభంనుంచే ప్రచలితమవుతూ ఉండేమోననిపిస్తుంది. నాకు స్పష్టంగా తెలియదు. ఈ శతాబ్దంలో పాతికేళ్ళు దాటినతర్వాత జన్మించిన తరంమాది కనక 1980లు నుంచీమాత్రం కాలం మారిందనే నానుడిని నిత్యం వింటూనే ఉన్నాం. అంతకుముందే సర్వత్రా వ్యాపించి, ఒకవూతపదంగా స్థిరపడి ఉండకపోతే దానికంత ప్రసిద్ధి ఏర్పడివుండదు.

చిత్రమేమంటే-కాలం మారింది అనే వారికిగాని, ప్రజలేమారారని అనే వారికి గాని, వ్యవస్థేమారిందన్న అవగాహన కలగలేదు. అందువల్లనే మనవ్యవస్థలో కలిగిన సత్యరూపాన్ని వారు దర్శించలేక పోయారు. శతాబ్దాలుగా మనదేశంలో సార్వత్రికంగా ఫ్యూడల్ వ్యవస్థ కట్టుదిట్టంగా ఏర్పడివుంది. దాదాపు ఏ మార్పులూ పొందకుండా తన చుట్టూ తానే గుడి సున్నా పడుతూ వచ్చింది 19వ శతాబ్ది అంతానికి ఫ్యూడల్ వ్యవస్థ

స్థను చీల్చుకుంటూ గచ్చి పెట్టుబడిదారీ వ్యవస్థ నిలదొక్కుకో నారంభించింది ఇతిహాసాల కాలనుంచి ఇంగ్లీషువాళ్ళకాలం వరకూ నిలచిన పాతవ్యవస్థను ప్రతిఘటించలేని స్థితిలో పడింది దాని దెబ్బలు కాచుకునే దురవస్థలోనే ఊపిరి పీల్చనారంభించింది భూస్వామ్యవ్యవస్థకుపట్టుగొమ్మలైన కులమతాల పట్టు సడలనారంభించింది పెంపొందుతున్న పెట్టుబడిదారీ వ్యవస్థలో వీలయినంతవరకూ భూస్వామ్య వ్యవస్థరాజీపడి సద్దుకుపోజొచ్చింది దాని యాజమాన్యంలోనే తలదాచుకు బ్రతికే వెసులు బాటు వెదుక్కొంది

భారతదేశ మంతటా ఊడలు దించి స్థిరపడిన సామ్రాజ్యవాదం – తన మనుగడను సుస్థిర మొనరించుకుందుకు – తమ వరిపాలన సౌకర్యంగా యథేచ్ఛగా సాగించుకుందుకు – ఈ దేశాన్ని తమవలసగా మార్చుకున్నారు. తమ అవసరార్థమే పెట్టుబడిదారీ వ్యవస్థను పెంపొందించారు భూస్వామ్యవ్యవస్థను తమకులోబడి నడుచుకునే పరిధిలోనే పెంచి పోషించారు. తమ ఎగుమతులకనుకూలంగా యీదేశం లోని ముడిసరుకులను మార్చడానికి చిన్న చిన్న ఫ్యాక్టరీలెన్నో నెలకొల్పారు. రైలురోడ్లు నిర్మించి సైనిక నిరవాల ప్రయాణానికి సదుపాయం ఏర్పరచుకున్నారు.

పెట్టుబడిదారీవ్యవస్థ ఫ్యూడల్ వ్యవస్థ కన్న ప్రజలకు సహజంగానే ఆలోచనా స్వేచ్ఛ కలిగిస్తుంది. దానితోపాటు ఆచరణ స్వేచ్ఛ ఉద్భూతం కావడం తప్పనిసరి పరిణామమే. సమాజవ్యవస్థలో ఆరాధనా స్వేచ్ఛ తనంతతానుగా పెరగనారంభించింది. ఆంగ్లవిద్యార్జనా ప్రభావంతో మతిమాద్యం సడలనారంభించింది. లేదా మతం ఉపేక్షించబడింది. ఈవిధంగా భూస్వామ్య వ్యవస్థలో మతానికి సహజాసైగల పటూపలుకుబడీ సన్నగిల్లాయి పురాతవ్యవస్థలో పెరిగిన వర్ణవ్యవస్థ ఆయువుపట్లు కదిలిపోనారంభించాయి ప్రతిఆచరణకీ ముందస్తుగా ప్రశ్న పురోగమిస్తూ నిలచింది సామాజికుల నడుమ ఎక్కువ తక్కువలు, స్త్రీలకు అనుమాన్యంగా కలిగించిన బానిసత్వమూ, సమాజంలో కొందరి పట్ల అస్పృశ్యతా నిషేధమూ వంటినికృష్ట ఆచారాలు తీవ్రంగా ప్రశ్నించబడ్డాయి. 19 వ శతాబ్దంలోనే అవతరించి వికసించిన సంస్కారహృదయులందరికీ యీ మార్పు దృక్పథం దాదాపు ఒకేస్థాయిలో ప్రవర్తిల్లింది.

స్త్రీ బానిసత్వాన్ని నిర్మూలించడానికి తొలిచర్యగా స్త్రీవిద్యకు ఉపస్కారం కలిగింది. అటు బెంగాలులో ఈశ్వర చంద్ర విద్యాసాగరులనే మహాపండితులీ స్త్రీ విద్యాదీపం వెలిగిస్తే–తెలుగు దేశంలో యుగపురుషుడు వీరేశలింగం బాలికావిద్యాంకురాన్ని దోహదం చేశారు. వారు మొట్టమొదటి బాలికా పాఠశాలను 1875 లో ధవళేశ్వరంలో స్వీయబాధ్యతతో నెలకొల్పారు మద్రాసు మహారాష్ట్రమంతటికీ అదే ప్రథమ జయఘంటికానాదం. వస్తుగతంగా ఈ ఆరంభం అల్పమే కావచ్చు, గుణప్రధానంగా చూస్తే ఇది అనల్పమే! వ్యవస్థాత్మక పరిణామంలో యిది ప్రప్రథమ అభివ్యక్త చర్యగా చరిత్ర దీనిని పరిగణించింది.

అంటరానితనాన్నీ, కులాల ఎక్కువ తక్కువలనూ కూలంకషంగా కూల్చడానికీ, వర్ణవ్యవస్థను తొలగించడానికీ బ్రహ్మసమాజం ఆవిర్భవించింది అంటరానితనం కాని స్వేచ్ఛను క్రైస్తవ మతం కలిగిస్తుందన్న ప్రచారం అడుగువర్గాల ప్రజలను విపరీతంగా ఆకర్షించడం వల్ల వెనుకబడిన తరగతుల ప్రజలు వేలాదిగా ఆమతంవైపు ఆకర్షితులవుతున్నారు ఆ దశలో వైదిక మతాన్ని సంస్కరించి, పునర్నిర్మించడమే పరమావశ్యమని భావించి బ్రహ్మసమాజం ఆవిర్భవించింది. మతాంతరీకరణ ప్రబలమవుతున్న వెల్లువను అరికట్టి హైందవమతాన్ని బ్రహ్మసమాజం సంరక్షించగలిగింది సరిగ్గా అదేసంకల్పంతో ఆర్యసమాజం కూడా కృషిసల్ప పూనుకుంది. కులాలమధ్య స్థిరపడివున్న అంతరాలను నిరసించింది. వైదికమతస్థులైన భారతీయులంతా ఒకేవర్ణమని నిశ్చయించింది హిందూమతస్థులంతా బ్రాహ్మణులేనన్న మాత్న ధర్మంప్రచారం చేసింది యజ్ఞోపవీత ధారణకు సర్వులూ అర్హులేనని ప్రకటించింది పుట్టుకతోనే కాక, మతం పుచ్చుకోవడం ద్వారా కూడా సంక్రమించగలదన్న సంస్కరణప్రవేశ పెట్టింది. ప్రలోభాలకు లోనై మతం మార్చుకున్న వారిని తిరిగి హిందువులుగా మార్చే ప్రాయశ్చిత్తచర్యలారంభించింది. ఇది అపూర్వ సంఘసంస్కరణేకాని మత పరిధికే నియతమైంది ఆర్యసమాజ ప్రవక్త స్వామీ దయానంద సరస్వతి యావద్దేశమూ పర్యటించి, వివేకానందుని తర్వాత అంతటిఅపారప్రభావాన్ని కలిగించాడు.

గతశతాబ్ది చరమదశకంలోనే తెలుగు దేశం మీదుగా రైలు రోడ్డు నిర్మాణం జరిగింది. యావద్భారత దేశంలోను గతంలో ఎన్నడూ ప్రజలు ఎరుగనంతటి ప్రయాణ సౌకర్యం ఏర్పడింది. వేగమూ భద్రతా లభించాయి ఉత్తరభారతానికీ దక్షిణాపథానికీ ప్రధానమార్గం తెలుగు దేశం మీదుగా ఏర్పడింది. ప్రజల పర్యటనలు పెరుగజొచ్చాయి కొత్త అవకాశాలు–కొత్త ఆలోచనలను ప్రోదికాయి. సమస్తభాషల నడుమా ఆదానప్రదానాలు విరివిగా పెరిగాయి. దేశం

ఇతరేతర భాషాసంస్కృతులతో పరిచయాలు అధికతరమయ్యాయి.

రాజమహేంద్రి వద్ద గోదావరి వంతెన కాటన్ మహాశయుడు నిర్మించారు మొదటి రైలుబండి ప్రారంభమైనపుడు ప్రజలు విశ్వసించలేకపోయారు. భయోత్పాత నుంచి తేరుకోలేక పోయారు. వీరేశలింగంగారి ప్రధాన శిష్యులు సాంఘిక సంస్కర్త కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు రైలుప్రయాణం గురించిన అపనమ్మకాలను తొలగించడానికి అనుచర వర్గంతో బయల్దేరి కొవ్వూరు వరకూ వెళ్ళి వెనక్కి తిరిగివచ్చి ప్రదర్శనం చేశారు.

మనదేశంలో ఉద్యోగార్థులై వచ్చి స్థిరపడిన ఆంగ్లేయులు, ఇతర పాశ్చాత్యులు, ఉదార బుద్ధితో భారతీయనాగరకతా విశేషాలను పరిశోధించడం 19 వ శతాబ్దారంభనాటికే ఆరంభించారు జాతీయభావాలు నేర్పునని సాహిత్య పరిశోధనతో తీవ్రకృషి సల్పారు. చరిత్ర లేని భారత జాతికి ఒక చరిత్రనూ, ఒక సాంస్కృతిక పరిణామ సమాచారాన్ని సేకరించి గ్రంథాలు ప్రచురించారు.

రామకృష్ణ పరమహంస, ఆయన శిష్యుడు స్వామీ వివేకానందగార్లు హిందూమతంలోని కర్మణ్యత్వాన్ని, దీనజన సేవను ప్రబోధించారు. సమానత్వాన్ని ప్రధాన మొనర్చారు వేదకాలంనుంచీ ప్రవర్తిల్లిన సత్వగుణప్రధానత్వం వల్ల దఫదఫాలుగా హానిసత్వాన్నే వరించవలసివచ్చిందనీ, భారతజాతి సాధించిన విజయాలేమీ కావనీ వివేకానందులసత్యాన్ని చాటారు. కర్తవ్యపాలన ధ్యేయమని. పురుషకారంతో జాతిజీవద్వంతాకావాలని అందుకు రజోగుణాన్నే అవలంబించడం మంచిదని ఆయన ప్రబోధించారు. ఆయనే మొదటిసారిగా పాశ్చాత్యుల కనులముందు భారతీయ నైతికాధ్యాత్మిక సంపదను ఆవిష్కరించారు. అంతవరకూ పాశ్చాత్యులు-భారతీయులపట్ల హేయమైన దృష్టి ప్రదర్శించేవారు. వారు అనాగరకులనీ, సంస్కృతి విహీనులనీ ప్రచారం చేసేవారు వివేకానందుల జ్ఞానప్రభోదంతో వారిఅజ్ఞానంపటాపంచలైంది.

(ఇంకావుంది)

* * *

ఆవంత్స సోమసుందర్
కళాకేళి నికేతన్
పిఠాపురం

# పద్యకవిగా పద్మశ్రీ సి. నా. రె.

డా॥ రామడుగు వెంకటేశ్వరశర్మ

డా॥ సి నారాయణరెడ్డిగారి పేరు చెబితే సామాన్యజనానికి గుర్తువచ్చేవి ఆయన సినిమా పాటలు సాహిత్య పరిచయం ఉన్నవారికి జ్ఞప్తివచ్చేవి ఒకప్పుడు ప్రౌఢగేయ ప్రబంధాలుగా పేరుపొందిన 'కర్పూర వసంతరాయలు', 'నాగార్జున సాగరము', 'విశ్వనాథనాయుడు'- నిన్న మొన్న జ్ఞానపీఠ బహుమతి పొందిన 'విశ్వంభర' వచన కావ్యం. తరచు పత్రికల్లో కనిపించే 'ప్ర'పంచపదులు, ద్విపదులు.

కాని ఆయన గొప్ప పద్య నిర్మాణ దక్షతగల కవి అని ఎక్కువమందికి తెలియదు అసలు ఆయన కవితాజీవితంలో మొదట పద్యాలే ప్రకాశించాయి. చందస్సు అంటే ఏమిటో తెలియని ఆరవ తరగతినుంచే కవితలు వ్రాయనారంభించిన ఆయన నోటినుంచి ఎనిమిదవ తరగతి తెలుగు వాచకంలోని నక్క కథ అప్రయత్నంగా

"ఒకనాడు ఒక నక్క అడవిలోపల
పొట్టకోసర మెటో పోవుచుండె"

అన్న సీసపద్యమే వెలువడింది మొదటగా. 1948, 49 ప్రాంతాల్లో రచించి 1958 అక్టోబరులో ముద్రించిన 'జలపాతం' అన్న ఖండకావ్యసంపుటితోనూ, 1954 జూన్నుండి '58 నవంబరు 21 వరకు వ్రాసి, 1959 లో ముద్రించిన 'దివ్వెల మువ్వలు' అన్న ఖండకావ్య సంపుటిలోనూ సి. నారాయణరెడ్డిగారి హృద్యమైన పద్యాలు మనకు దర్శనమిస్తాయి. 'జలపాతం' ఖండకృతిలోని సూర్యోదయ, వర్షర్తు, వసంతర్తు, స్త్రీ సౌందర్య, విరహవేదనా సంబంధమైన వర్ణనలు పద్యాల్లో ఉన్నాయి. ఈ వర్ణనల్లో ప్రబంధ, భావ, అభ్యుదయ కవుల ఛాయలు గోచరిస్తాయి. ప్రాచీనాంధ్ర కవులలో శ్రీనాథుని ప్రభావం, ఆధునికులలో శ్రీశ్రీ, దాశరథి కవుల ప్రభావం వీరి రచనల్లో కనిపిస్తుంది. నారాయణరెడ్డి గారి పద్యాల్లో చక్కని ధారాశుద్ధి, స్వచ్ఛత, స్పష్టత, సంస్కృతాంధ్ర పదబంధ సౌందర్యం పాఠకుల కళ్ళకు కడతాయి ఈ లక్షణాలు 'జలపాతా'న్ని దాశరథిగారి కంకితం చేస్తూ రచించిన 'నివేదన' పద్యాల్లో కనిపిస్తాయి ఇలా-

'దాశరథీ! మనోజ్ఞ కవితాశరథీ!
శరదిందుచంద్రికా

శేశల కావ్యఖండముల నిండిన నీ కల
మందునన్ మహో
గ్రాశనిపాతముల్ వెలయునోర!
మహోజ్జ్వలని కంటిలో సుధా
రాశితరంగముల్ కటుహాలాహల కీలలు
పొంగినట్లుగా ॥"

"కలశాంబుధుల నీవు నేనిటులె స్నిగ్ధ
స్నేహబంధాల బ
ద్ధులమై యుందము; ఏకగీతి నిరుగొంతుల్
విప్పి విన్పింత; మాం
ద్యము చైతన్య వితంచికాపథుల
విన్యాస్వాదముల్ సేయగా
జలపాతమ్ములవోలె దూకెదము
దివ్యశ్వాసహితి శృంగముల్ ॥"

పై మొదటి పద్యంలో చక్కని ధారాశుద్ధి, సంస్కృత పదబంధ సౌందర్యంతో పాటు అందలి పోలికచే దాశరథి 'అమృతాభిషేకం', 'అగ్నిధార' కావ్యాల రచనను స్ఫురింపజేశారు ధ్వని ప్రధానంగా. రెండవ పద్యం జలపాతంలాగానే దూకింది నిజంగా.

ఇక 'దివ్వెల మువ్వలు' ఖండకావ్యంలోని 'జన్మదినం', 'సురభిళాశ్మ', 'వర్షాసుందరి' కవితాఖండికలు హృద్యపద్యశోభితాలు. సురవరం ప్రతాపరెడ్డిగారిని స్మరిస్తూ వ్రాసిన 'అశ్రురాంజలి' గేయకవిత అయినా, అందులో ఒక (చంపకమాల) పద్యం ఉంది. 'వర్షాసుందరి'లో మేఘమాలను వర్ణించిన

సీ॥ "కొదమతేగంటి పొల్గడుపగా పరు
గెత్తు నిండుపొదుగుల ఆలమందలట్లు
పరవాహినుల బదాబదలొనర్పగ
సాగు శరసముద్ధురయోధవరులయట్లు
నిజమహోన్నతబంధనిక్షిప్తదానాంబు
గంభీర మత్తేభగణములట్లు
తొడిమవీడని పూలబిడితుంపుబరువుతో
అడుగుమోపెడు కన్నెపడుచులట్లు
విరహిణీపాండురకపోల వీథులందు
జీరువారు నీలాలకశ్రేణులట్లు
సరసగమనాలతోడ ఆషాఢమాసవేళ
లందు కాదంబినుల్ వెడలెనవిగో!"

అన్న సీసపద్య గమకం శ్రీనాథుని సీసంలా రసనిర్భరంగా, గంభీరంగా సాగింది. ఇందలి పోలికలు ప్రబంధ భావపరిమళాలను ఒక్కసారి గుప్పుమనిపిస్తాయి ముఖ్యంగా "తొడిమ వీడని పూలబిడితుంపు బరువుతో అడుగు మోపెడు కన్నెపడుచు లట్లు' అన్న పోలికలోని భావంగాని, తెలుగుపదాల పోహళింపుగాని గొప్ప రసానుభూతికి ఆస్పదం అయితే, పానకంలో పుడకలాగా మొదటి పాదంలో సీసపద్యగమకం సడిపోయినా, ఛందఃపరంగా చూస్తే ఒక్క అక్షరం ఎక్కువయింది.

ఇలా ప్రాచీనభావాలే కాక ఆధునికమైన సామ్యవాద సిద్ధాంత ప్రతిపాదనను కూడ పద్యంలోనే చేశారు తేటతెల్లంగా. తేటగీతిలో ఈ ఘట్టంలోనే ఇలా-

గీ॥ "మిట్టలన్ గూడుగట్టిన మట్టినెల్ల
పల్లముల దించి, మిట్టలన్ పల్లములను
ఏకవర్ణమ్ములోన చిత్రించి,సామ్యవాద
పాఠము నేర్పె నీవాననీరు ॥"

అలాగే 'జలపాతం' ఖండకావ్యంలో వర్షావతరణాన్ని ఒక ప్రకృతి శృంగార రేఖలతో చిత్రిస్తూనే మరో పద్యంలో "మేడలోని ధనస్వామి, నీడలేని కాడిత ప్రాణి స్నేహమాత్రాలలోన మాడిపడునట్లుగా" కురిసిన వర్షంతో భూమ్యాకాశాలు ఏకమైపోయాయని చెప్పి సామ్యవాదాన్ని ధ్వనింపజేశారు అలాగే సూర్యోదయ వర్ణనలో ఎర్ర జెండాను సూచించి తద్వారా శ్రామిక జనచైతన్యాన్ని ధ్వనింపజేసే నవీభావప్రదర్శనకు పద్యాన్ని వాడుకున్నారు 'ఉదయధ్వజం' అనే ఖండికలో-

గీ॥ కరకు రాచరికమ్మును తరిమివేసి
శ్రామికులు లేవనెత్తిన క్రాంతి వైజ
యంతిపోలిక, నైశాంధ్యమ్ము డంప
ప్రాగ్ధరజిపాచె ఉదయసూర్యధ్వజమ్ము

ఈ వర్షావర్ణనలోనే భూమ్యాకాశాలకు ఆధునికమైన విచిత్ర దాంపత్యానురాగ భావాన్ని పద్యంలో ప్రదర్శించి సహృదయుల నాకట్టుకున్నారు ఇలా

"కానో అంబరపాలకుండు, తన కాంతా
రత్నమౌ నిమ్నలో
కావన్ నిల్చి తపించు భూరమణి,తత్కాంతా
మనోజాతబా
ధానిశ్వాసము సోకినంతటనె
సంతప్తాత్ముడై మేఘుడౌ
రా! నీరై ప్రవహించి కౌగిలిడు,చిత్రమ్ముల్
గదా! ప్రేమముల్ ॥"

ఇందులో ఉన్నది భావకవితా వైశిష్ట్యమే కాదు- పద్యపు టెత్తుగడలో వ్యావహారిక వాక్యవిన్యాసం ఉంది. సంస్కృత సమాసంతో అలవోకగా గమించే రచనావిన్యాసం కూడ ఉంది- పద్యం మధ్యలో.

నారాయణరెడ్డిగారి పాటల్లోనేకాక పద్యాల్లోగూడ చక్కని వర్ణచిత్రాలను గీశారు ఇంగువ వర్షాకాలంలో పల్లె పొలాల్లో విత్తులు నాటే సన్నివేశాన్ని చిత్రించిన ఈ క్రింది పద్యం తార్కాణం-

"ముందుగ కోడెరైతు హలమున్
నడిపించగ, వెన్కవెన్క నిం
దిందిరవేణి, వాని రమణీమణి విత్తులు
జార్చునట్టి ఆ
సుందరదృశ్య సంపదను జూడగ పల్లెల
నుండగావలెన్
ఎందుకు పట్టణాల నివసించెదె

కృత్రిమమైన కాముకల్ ॥"
-చిగురుటాకుల్॥''

పైపద్యాన్నిబట్టి సహజమైన గ్రామీణ వాతావరణాన్ని ఆకాంక్షించే నారాయణ రెడ్డిగారి ప్రకృతి సౌందర్య ప్రియత్వం వ్యక్తమౌతోంది.

'గుత్తం సత్తి నెత్తుకొని దూరపు చేలకు గాలితోడ పర్విత్తెదు కాపుభామ లకు, వేగముగా పయనించు మేఘసంపత్తికి" ఎక్కువగా తేడాలేదట "మొత్తముపై పయోధరసమున్నమితాంగులు గాదె ఇర్వురున్" అని పద్యంలో వ్యంగ్యంగా ప్రాచీన కావ్యాల పోకడలో శ్లేషను వెలిగించారు నారాయణరెడ్డిగారు-ముఖ్యంగా 'పయోధర' శబ్దంవద్ద. ఇట వస్తువు సామాజికం-భావన ప్రాచీనం

నారాయణరెడ్డిగారి పద్యాల్లో తేటగీతు లెక్కువ. వాటిల్లో ఛందస్సు ఉన్నా, అది భారంగా నడుస్తున్నట్లుగా ఉండవు. ఛందస్సులేని కవితమైన మామూలు వాక్యాల్లా ఉంటాయి.

"ఎన్నిఋతువులు గడచె నాకన్ను లెదుట
మబ్బులవలె, వెన్నెలవలె, మంచువలె"

ఇది 'సురభిళాశ్మ' ఖండిక లోనిది. ఇందలి చివరిపాద గమకం మాధుర్యం వాక్యవిన్యాసమే. పద్యాల్లో, ముఖ్యంగా వృత్తపద్యాల్లో పదంతో పాదాంతం చేయక ఆ పదాన్ని రెండవ పాదం మొదటి అక్షరం దగ్గర ఆపి, ప్రాస స్థానంనుండి మరో పదాన్ని అందుకొని పద్యాన్ని నడపడం అనేది రచనాకౌశలానికి చిహ్నం. ఉదా -

"అతడు ప్రతాపరెడ్డి,ఇరులై పడియున్న
తెలుంగువారి గుం

(తరువాయి 6వ పేజీలో)

# చిత్తూరు తెలుగు వ్యావహారిక భాషలో తమిళభాషా ప్రత్యయం దా/దానే

—డా॥ ఆర్ అన్నపూర్ణ

భాషాపరంగా చిత్తూరుజిల్లా రాయలసీమ మాండలికానికి చెందినది అందుచేత రాయలసీమ సామాన్య లక్షణాలు ఈ జిల్లాలో సాధారణంగా కనిపిస్తాయి. ఇవేకాక తమిళ,కన్నడ భాషారూపాలు కూడా ఈ జిల్లా తెలుగు వ్యావహారికంలో కన్పించడానికి చాలా అవకాశాలు ఉన్నాయి కాని తమిళభాషయొక్క ప్రభావమే ఎక్కువ మోతాదులో ఉన్నట్లు తెలుస్తున్నది.

చిత్తూరు వ్యావహారిక భాషను సూక్ష్మంగా పరిశీలించి చూస్తే తమిళ పదాలు, ప్రయోగాలు చాలా ఎక్కువగా కలసి మిశ్రమమై ఉన్నాయి. ఒక్కొక్కప్పుడు సగం తెలుగు, సగం తమిళం కలిసిన ప్రయోగాలు ఇక్కడ వినిపిస్తూ ఉంటాయి. పదం తెలుగుఅయి ప్రత్యయం తమిళంకూడిన అలాంటి దా/దానే తో కొన్ని ప్రయోగాలు ఉదాహరణలతో ఈ వ్యాసం వ్రాయడం జరిగింది.

చిత్తూరుజిల్లావారు తమ వ్యావహారిక తెలుగులో తమిళ ప్రత్యయం అయిన దా/దానే ప్రయోగించుకుంటున్నారు ఈ ప్రత్యయం లేకుండా వీరు సంభాషణ సాగించరు. వీరు ఈ ప్రత్యయాన్ని ఊతపదంగా ప్రతి ఒక్క సందర్భంలో, వివిధ అర్థాలు స్ఫురించునట్లు ప్రయోగించుకుంటున్నారు. ఒక్కొక్కసారి వీరి సంభాషణ ఎగుటివాళ్ళకు, ముఖ్యంగా కోస్తాజిల్లావారికి అర్థంకాదు. ఎందుకంటే వీరి భాష, ఉచ్చారణ అంతా తమిళం వలెనే ఉంటుంది. ముఖ్యముగా తమిళ ప్రత్యయం దా/దానే వాడుటవలన ఈ జిల్లావారి భాష అంతా తమిళంవలెనే ఉంటుంది ఉదాహరణకి ఈ ప్రత్యయాన్ని ఏవిధంగా వివిధ సందర్భాలలో ఉపయోగించుకుంటున్నారో ఇక్కడ వివరించడం జరిగింది.

1. 'దా ప్రత్యయం 'ఏ' వార్థకాన్ని సూచిస్తున్నది.

| ఉదా - తెలుగు | తమిళం |
|---|---|
| 1. వాళ్ళు 'దా' వచ్చినారు (వాళ్ళే వచ్చినారు) | అవంగ 'దా' వందార్ |
| 2. నేను 'దా' వస్తిని (నేనే వచ్చాను) | నాన్ 'దా' వందేన్ |
| 3. అది 'దా' ఉండాది (అదే ఉంది) | అదు 'దా' ఇరుక్కు. |

2. కొన్ని సందర్భాలలో తప్పకుండా, తప్పనిసరి అను అర్థం వచ్చేట్లు ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు.

జె తెరలు దుల్పి వెల్గులనునిల్పిన మిత్రుడు,
మార్గభవోయిన
ట్టి తెలుగుజాతి సంస్కృతికి టీకలు
తీసిన మల్లినాథుః; ఉ
న్నతరములైన పాతవడ తేరని సృష్టికి
నాద్యుడాతడే ॥"

మూడు నాలుగు పాదాల్లో ప్రాసస్థానం వద్ద పైన పేర్కొన్న పద్యరచనాశిల్పం ఉంది.

'సురభిశాఖ' ఖండికలో ఒకచోట "ఈ సౌరభ సమీర మాలాసర్పణమున హృదంతరజ్వలనశిఖల్" అన్న కంద పద్యం మొదటి పాదంలో ఎందువల్లనో గణభంగం అయింది. "ఈ సౌరభమారుత మాలాసర్పణమున హృదంతరజ్వలన శిఖల్" అని ఉంటే సరిపోతుంది.

మొత్తంమీద పద్యానికీ, గేయానికీ అంతరం తెలిసిన నారాయణరెడ్డిగారి రచనల్లో గేయంతోపాటు "హర్షవేపనా గానతరంగ శీకరవిక స్వరసుస్వర కావ్య ధార" కలిగింది ఆయన పద్యం.

అక్షరస్రవంతి! – గోదావరి!

సీ॥ శుచియైన నీవారి రుచిమాటే? కాదది
 వన్నెయౌ రుచిరార్ద్రవతగాని
గంభీరగమన వేగమ్మటే? కాదది
 తిక్కనాదు ప్రౌఢవాక్ శ్రేణిగాని
క్రమవారంగ లేటే? కాదది పీఠిక
 లింగసంస్కృతుల హోరంగుగాని
ఘనపరిమళమటే? కాదది ఆంధ్రపు
 రాణ సత్కవన సౌరభముగాని
అద్దినీ వేణియటె? కాదు హనుమదింద్ర
గంటి యమృతగాథల మేలికలిమిగాని
ఆంధ్రసాహిత్యలోకాన అక్షరస్ర
వంతివౌదువో గౌతమీ! పలుకవేల?

* * *

| తెలుగు | తమిళం |
|---|---|
| 1. అన్నా నువ్వు'దా' ఆ పని పెయ్యి అన్నా (అన్నా నువ్వు ఆ పని చేసిపెట్టాలి) | అణ్ణా నీదా అంద వేలై పెయ్యణుం అణ్ణా |
| 2. సామి/అయ్యా మీరు'దా' నన్ను కాపాడాలి | సామీ/అయ్యా నీంగదా ఎన్నై కాపాత్తనం. |

3 అవసరమున్నా లేకున్నా కొన్నిచోట్ల ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు.

| తెలుగు | తమిళం |
|---|---|
| 1 గుడ్డలు'దా' ఉతకాలి. (గుడ్డలు ఉతకాలి) | తుణిగదా తోకిణం. |
| 2 పనికి'దా' పోయిండాడు. (పనికి పోయినాడు) | వేలైకిదా పోనాన్. |
| 3 నాకు'దా' ఏమి తెలుసును. (నాకు ఏమి తెలుసును) | ఎనక్కుదా ఎన్న తెరియుం. |

4 కొన్ని సందర్భాలలో ఈవిధంగా, ఇలాగే, ఈ మాదిరి అను అర్థం వచ్చేట్లు ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తున్నారు.

| తెలుగు | తమిళం |
|---|---|
| 1. ఇదే బతుకు'దా' మేము బతుకుతా ఉండాము. (కూటికి గుడ్డకి లేకుండా బతుకుతున్నాము) | ఇదుదా ఎంగళ్ పొళప్పు. |
| 2. అది ఇదేమాదిరి'దా' ఉండాది. (అది ఇలాగే ఉండాది) | అదు ఇదుమాదిరిదా ఇరుక్కు. |

5. కొన్నిచోట్ల కాలనిర్ణయాలలో ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు.

| తెలుగు | తమిళం |
|---|---|
| 1. తింటూ'దా' ఉండాను. (తింటున్నాను) | తిన్నూట్టుదా ఇరుక్కెనన్ |
| 2 నువ్వు రేపు'దా' రా (నువ్వు రేపు రా) | నా నాళెక్కిదా వా |
| 3 నేను నిన్న'దా' ఊరునుండి వస్తిరి. (నేను నిన్న ఊరునుండి వచ్చాను) | నాన్ నేతుదా ఊరిలిందు వందేన్ |

6. కొన్ని సందర్భాలలో చాలా మొత్తం/చాలా ఎక్కువ అను అర్థం వచ్చేట్లు ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు.

| తెలుగు | తమిళం |
|---|---|
| 1 దుడ్లు'దా' యారాళంగా ఖర్చు అయింది. (పెండ్లికి) | దుడ్డుదా రొంబా శెలవానదు |

# సావిత్రిగారి "బందిపోట్లు" గేయ పరామర్శ

శ్రీ ఖండాపు మన్మథరావు,
M A ,M Phil ,

పద్యమైనా గద్యమైనా గేయమైనా చివరకు సాహిత్యం ఏ ప్రక్రియైనా ఆలోచించి అందులో సారముంటే ఆదరించాలి, అభిమానించాలి, దాన్ని స్వీకరించాలి.

ఇటీవలకాలంలో స్త్రీవాదం పేరుతో కొందరు మహిళలు గేయాలు వ్రాస్తూ సంకలనాలు చేస్తున్నారు వ్రాసేదంతా కవిత్వంకాదుగాని వ్రాసే గేయాల్లో ఎక్కువగా కవితాలక్షణాలు కనిపిస్తున్నాయి స్త్రీలను గూర్చి వ్రాస్తుంటేనే స్త్రీవాదమవుతుందా? స్త్రీలను గూర్చి పురుషులు వ్రాస్తే అది స్త్రీవాదంకాదా? ఒకవేళ అలాఅయినపుడు అత్యాధునికుల్లోనే చాలమంది పురుషపుంగవులు స్త్రీల యొక్క దయనీయ పరిస్థితిని కవిత్వం ద్వారా అనేక రూపాల్లో తెలియజేశారు. గురజాడ 'కన్యాశుల్కం'లో స్త్రీవాదం లేదా? కరుణశ్రీగారి పాకీపిల్ల ఊర్మిళ, సావిత్రి మొదలైనవి స్త్రీవాదంతో కూడినవి కావా? ఊర్మిళా సావిత్రిలు పౌరాణిక పాత్రలంటామా? ఐతే శ్రీశ్రీగారి 'భిక్షువర్షీయస్'? బీద దంటామా? సరే! వీటన్నింటిలో నామమాత్రంగానే స్త్రీవాదం ఉందని నా తృప్తికోసం తిరిగి నేనే సమాధాన పడుతున్నాను.

ప్రాచీన కావ్యాల్లో స్త్రీని పతివ్రతాశిరోమణిగా కడు పూజ్యురాలుగానిర్మా

(తరువాయి 8వ పేజీలో)

| | |
|---|---|
| 2. ఈ పండక్కు ఎంత'దా' దుడ్లు దండ్లు ఖర్చవుతుందో నాకు తెలియదు. (ఈ పండగకి ఎంత డబ్బు ఖర్చు అవుతుందో తెలియదు) | ఇంద పండైక్కి ఎవ్వళవు పణందా శెలవాగుమో ఎనక్కు తెరియాదు |

7. కొన్ని సమయాలలో మొత్తం/అందరు అను అర్థం వచ్చేట్లు ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు.

| తెలుగు | తమిళం |
|---|---|
| 1. నిన్న ఊరికి అందరుదా పోతిమి. (నిన్న ఊరికి అందరూ వెళ్ళాము) | నేత్తు ఊరుక్కు ఎల్లారుందా పోనం |
| 2 శెట్టి అప్పులకోసరం'దా' అంత ఆస్తి'దా' అమ్మేసినాడు (శెట్టి ఆస్తి అంతా అమ్మేశాడు) | శెట్టి ఎల్లాం ఆస్తిదా విత్తుట్టాన్ |

8. కొన్ని సమయాలలో కొంతవరకు/అంతవరకు అను అర్థం వచ్చేట్లు ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు.

| తెలుగు | తమిళం |
|---|---|
| 1 ఇంటిపని కడగాలు'దా'క'దా' అయింది. (ఇంటిపని పునాదులు వరకు అయింది) | పీడు కడగా వరైక్కుదా ఆనదు |
| 2. నాకు దోశ కొంచెం'దా' తెలుసును. (నాకు దోశ కొంచెం తెలుసు) | ఎనక్కు వళి కొంజందా తెరియుం |

9. కొన్ని సందర్భాలలో నిండు/పై వరకు అను అర్థం వచ్చేట్లు ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు.

| తెలుగు | తమిళం |
|---|---|
| 1. అంగడివాడు డబ్బా నిండా'దా' బియ్యం ఇచ్చినాడు. (అంగడివాడు డబ్బానిండా బియ్యం ఇచ్చాడు) | కడైకారన్ డబ్బా నిరయదా అరిసి కుడుత్తాన్ |
| 2. రంగడు బిందె/తపిలా నిండ'దా'/ పైకి'దా' నీళ్ళు తెచ్చినాడు. (రంగడు బిందెనిండా నీళ్లు తెచ్చాడు) | రంగన్ కుడం నిరయదా తణ్ణి కొండాందాన్ |

10. కొన్నిచోట్ల కొరకు / కోసరం అను అర్థం వచ్చేట్లు ప్రయోగిస్తారు.

| తెలుగు | తమిళం |
|---|---|
| 1. నేను పనికి'దా' ఎక్కడికి పొయ్యేది. (నేను పనికి ఎక్కడికి పోవాలి) | నాన్ వెంకి'దా' ఎంగదా పోగణుం |
| 2 నేను దుడ్లుకు దా' వస్తిని. (నేను డబ్బుకొరకు వచ్చాను) | నాన్ దుడ్డుకుదా వందేన్ |

ణం జరిగింది మరొకదిక్ స్త్రీని భోగవస్తువుగా, అంగాంగ వర్ణనలతో చిత్రించినప్పటికీ, ప్రాచీన సాహిత్యంలోనే స్త్రీవాదానికి మూలాంకురములున్న వనక తప్పదు.

సంఘంలో అందరూ కాదుగాని కొందరు వ్యక్తులు స్త్రీకి సరియైన స్థానమీయక పోవడం, చిత్రహింసలకు గురిచేయడం వరకట్నాన్ని గూర్చి పీడించడం వంటి హైన సంఘటనల్ని రోజూ వార్తాపత్రికల్లో చూస్తున్నాం. అయినా మగవారం నోరుమూస్తున్నాం ఇలాంటి దౌర్భాగ్య పరిస్థితుల్లో స్త్రీలే స్వయంగా నేను స్త్రీవాదమే ప్రధానధ్యేయంగా భావించి, స్త్రీలకు నేటి సంఘంలోవున్న స్థానాన్ని, వారిపై జరుగుతుండే అన్యాయాల్ని, అక్రమాల్ని అపురూపంగా రచన చేస్తున్నారు స్త్రీవాదమనే కర్మాగారానికి కార్మికులు, పెడిసరుకులు కూడ స్త్రీలే. అయితే వినియోగదారులు మాత్రం స్త్రీలు, పురుషులు కూడ.

ఈ వాదాన్ని గూర్చి ఎక్కువ రచన చేస్తున్నవారిలో డా॥ జయప్రభ, కొండేపూడి నిర్మల, ఓల్గా పేరుతో పోపూరిలలిత కుమారి, ఘంటశాల నిర్మల వాణీరంగారావు మొదలైన వారంతా సుప్రసిద్ధులు. వీళ్ళేగాకుండా స్త్రీవాదాన్ని దృష్టిలో నుంచుకొని అపుడపుడు కవితలు వ్రాసేవారు సరికొందరున్నారు.

అలాంటి వారిలో 'సావిత్రి'గారొకరు ఒక సుప్రసిద్ధ ఆంగ్లదినపత్రిక (విశాఖపట్టణం) లో పనిచేస్తున్నారు కథలు, కవితలు, సమీక్షావ్యాసాలు వ్రాస్తుంటారు ఆమె 'బందిపోట్లు' పేరుతో ఇటీవల ఒక గేయం వ్రాసింది ప్రకృత కర్తవ్యం ఆగేయకరామర్శ

'పాఠం ఒప్పు చెప్పక పోతే
పెళ్ళి చేస్తాన'ని

11 కొన్ని సమయాలలో రెండు వాక్యాలు కలిపి మాట్లాడేటప్పుడు కూడా ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు.

| తెలుగు | తమిళం |
|---|---|
| 1. నీవు లెక్కల్లో 'దా' మార్కులు రాలే దనుకుంటే ఇంగ్లీషు, తెలుగులో కూడ దా మార్కులు రాలేదు. (నీవు లెక్కల్లో మార్కులు రాలేదనుకుంటే ఇంగ్లీషు, తెలుగులోకూడా మార్కులు రాలేదు) | ఉనక్కు కణక్కిల్ మార్క్ వరలే ఎన్నా ఇంగ్లీషు, తెలుంగిల్ కూడదా మార్కు వరలే |

మరికొన్ని సమయాలలో వీలున్నచోట్లలో ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు

| తెలుగు | తమిళం |
|---|---|
| 1 నాకు 'దా' ముందు తెలుసునే ఆ పని ఆమె చేసిందని / చేస్తుందని (నాకు ముందు తెలుసు ఆ పని ఆమె చేసిందని/చేస్తుందని) | ఎనక్కుదా మున్నడియే తెరియుం అందవెలై అవైసె దాళ్ంద్రు. |
| 2 నాకు దా' తలనొప్పిగా ఉండాది (ఏమి చేసేది నాకు తలనొప్పిగా ఉంది) | ఎనక్కుదా తల వలిమా ఇరుక్కు |
| 3 ఎట్ల'దా బతకాలో తెలియల్లేదు (ఎట్ల బతకాలో తెలియలేదు) | ఎప్పడిదా పొళక్కనియో తెరియలే |
| 4 మిమ్మల్ని ఎట్ల'దా' అర్థంచేసుకోనేదో తెలియలేదు. (మిమ్మల్ని ఎట్ల అర్థం చేసుకోవాలో తెలియలేదు) | ఉంగళై ఎప్పడిదా పురింజికునమో తెరియలే. |

కొన్నిచోట్ల 'దా'తో పాటు 'దానే' కూడా ప్రయోగిస్తారు. అవి కొన్ని క్రింద ఉదాహరణలతో వివరించడం జరిగింది.

1. కొన్ని సందర్భాలలో సందేహనివృత్తి కొరకు 'దానే' ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు.

| తెలుగు | తమిళం |
|---|---|
| 1. ఆ గుడిసెలో 'దానే' నువ్వు ఉండేది. (ఆ గుడిసెలోకదా నువ్వు ఉండేది) | అంద గుడిసిల్ దానే నీ ఇరుక్కిరదు |
| 2 సింగన్న 'దా'/'దానే' సాక్ష్యం ఇచ్చినాడు (సింగన్నే సాక్ష్యం ఇచ్చినాడు) | సింగన్ దా/దానే సాక్ష్యం పొన్నాన్ |
| 3. వాడు 'దా'/'దానే' కాపలవాడు | అవన్ దా/దాన్ కావల్ కారన్ |

2 కొన్ని సందర్భాలలో కాలనిర్ణయాలతో పాటు ఈ ప్రత్యయాన్ని ప్రయోగిస్తారు.

| తెలుగు | తమిళం |
|---|---|
| 1 తింటూ'దా'/'దానే' ఉండాను (తింటూ ఉన్నాను) | తిన్నూట్టు నాన్/నానే ఇరుక్కిరేన్ |

పంతులుగారన్నప్పుడే భయమేసింది'– అనే వాక్యం వలన ఈ గేయావిర్భావానికి బీజం ఆమె మనః ఫలకముపై, పసితనంలోనే నాటుకొన్నట్లు కన్పిస్తుంది. ఎందుకంటే పాఠాలు ఒప్పచెప్పడమనేది చిన్నతరగతులు చదువుతున్నప్పటిమాట. ఇకపోతే! పంతులుగారు 'పెళ్ళిచేస్తా' ననే మాటకు అర్థంపరిశీలిస్తే–

పాఠం ఒప్పచెప్పక పోతే పెళ్ళి చేస్తారట పంతులుగారు ఈ 'పెళ్ళి' ఎట్లాంటిదంటే 'మాంగళ్యం తంతునా అనేన మమజీవన హేతునా' 'అర్థేసు కాయేసు' ఇత్యాది మంత్రోచ్ఛరణతో కూడికొని పెండ్లికొడుతో సంప్రదాయబద్ధంగా జరిగేదికాదు మరేమంటే! వీపుపై బెత్తాం (కర్ర)తో మోత అనే వ్యంగ్యార్థం మరిదీనికి పెళ్ళికి ఏంసంబంధమంటే! "పెళ్ళి" అంతభయంకరమైనదని జననామనడిలో క్రమంగా ఏర్పడ్డ పర్యాయమైన మాట

ఇచట 'భయమేసింది' అనేమాటను తీసుకొంటే! భయమెందుకేసిందని? పెళ్ళి చేస్తాననడం వలన–పెళ్ళి చేస్తే భయమేస్తుందా? ఎంతమంది పెళ్ళిచేసుకోవడం లేదు, వాళ్ళంతా భయపడుతున్నారా? పెళ్ళంటే భయపడవలసిందికాదే!మనవాళ్ళంతా ఎంతో పవిత్రంగా భావిస్తున్నారే! భార్యాభర్తలు సంసారజీవితాన్ని ప్రారంభించడానికి పెళ్ళిమొదటి మెట్టుగదా! దాంపత్య సౌధానికి 'పెళ్ళి' ప్రప్రథమంగా వేసేపునాదిరాయిగదా!

చిన్నతనంలో పెళ్ళంటే సరియైన అర్థం తెలియకపోయినా పెద్దయ్యాక పంతులుగారనే పెళ్ళిని ఆలోచిస్తే అవగాహనయ్యింది అర్థం దొరికింది పెళ్ళంటే ఎందుకుభయ మేసిందో, గేయరచయితయే చివరకు జవాబుచెబుతుంది.

| | |
|---|---|
| 2. రేపు 'దాకే' ఆ పని చేయాలి/చేసేది. | వాళక్కడా/దాకే అంద కేరై పెయ్యాలుం |
| 3. నిన్న 'దానే' అక్కడ పరీక్ష అయింది (నిన్నే అక్కడ పరీక్ష అయింది) | నేట్రుదాన్/దాకే అక్కాటక్కు పరీక్ష ఆనదు. |

ఈవిధంగా చిత్తూరుజిల్లావారు తమ వ్యావహారిక భాషలో తమిళం ప్రత్యయం దా/దానే కలిపి మాట్లాడుతారు దీన్నిబట్టి చూస్తే తమిళభాషాప్రభావం ఈ జిల్లాపై ఎంతగా ఉందో తెలుస్తున్నది

REFERENCES


1. ఆంధ్ర తమిళ కన్నడ త్రిభాషా నిఘంటువు

సంపాదకులు – 1 వేదము వెంకట రాయశాస్త్రి, 2. శర్మ, 3. తిరుమల రామచంద్ర.

2. తెలుగు మాండలికాలు– చిత్తూరుజిల్లా, 1983 సంపాదకుడు బూదరాజు రాధాకృష్ణ.

3 A DRAVIDIAN ETIMOLOGICAL DICTIONARY By T Burrow and M B Emeneau, Oxford University Press, Ely House, London W I 1961

4 A STUDY ON LOAN WORDS IN TELUGU FROM COGNATE LANGUAGES (Unpublished thesis) By G V S R Krishnamurthy, Andhra University 1978


* * *


ఆర్. అన్నపూర్ణ,
లెక్చరర్,
నాగార్జున విశ్వవిద్యాలయం,
గుంటూరు.


0—0

'ఆఫీసులో నా మొగుడున్నాడు!
అవసర మొచ్చినా సెలవివ్వడని
అన్నయ్య అన్నప్పుడే అనుమాన
మేసింది'–

ఇది గేయంలో రెండవచరణం, ఇందులో అనుమానమొచ్చే విషయమేమంటే, ఆఫీసులో మొగుడుండడం. ఎవరికి మొగుడంటే? అన్నయ్యకి. అన్నయ్యపురుషుడు, మరి 'మొగుడు' అనేమాట (మగవాడు, మగాడు నుండి ఆవిర్భావం) కూడ పురుషునకే చెందింది. ఎలా వీరిద్దరకూ అన్వయం? అన్నయ్యకు మొగుడు ఆఫీసులో (ఆఫీసరు) వున్నాడు. ఆఫీసుల్లో మొగుళ్ళుంటారా? ఉంటారు. ఎలాంటివారంటే? 'అవసర మొచ్చినా సెలవివ్వ'ని వాళ్ళు. సెలవివ్వనంతమాత్రాన మొగుళ్ళవుతారా? అవుతారు. ఎలా అంటే! సెలవు పెట్టవలసిన అవసరమొచ్చింది, సెలవు పెట్టుకోవడానికి అవకాశమూ వుంది. సెలవు పెట్టేందుకు అధికారమూవుంది. ఇన్ని ఆధారాలున్నప్పటికీ ఆఫీసరు సెలవీయడు కనుక. ఇక్కడ "మొగుడ" నే పదం స్వేచ్ఛానిరోధకునిగా వాడబడింది.

'వాడికేం? మగమహారాజ'ని
ఆడా మగా వాగినప్పుడే
అర్థమైపోయింది–
'పెళ్ళంటే 'పెద్దశిక్ష' అని
'మొగుడంటే 'స్వేచ్ఛాభక్షకుడ'ని–

— అనే వాక్యాల్లో 'మగమహారాజు' గూర్చి ఆలోచిస్తే పైన చెప్పినట్లుగానే 'మగ' అంటేనే పురుషజాతి, 'రాజు' పదమూ గూడ పురుషునకు సంబంధించి

నదే. మగమహారాజంటే ఎదురులేనివాడనే భావం.

“పెళ్ళి”లో వుండే ‘పె’కి ఇచ్చే సంక్షేపము [Abbreviation]

‘పెద్దశిక్ష’ పంతులుగారు చేస్తామన్న “పెళ్ళి”ని అన్నయ్య ఆఫీసులోవుండే ‘మొగుడు’లను ‘పెద్దశిక్ష’, ‘స్వేచ్ఛాభక్షకు’లుగా గేయకర్త ఖచ్చితంగా చెప్పింది.

‘మేం పాలిచ్చి పెంచిన జనంలో
సగమే
మమ్మల్ని విభజించి పాలిస్తోందని!’_

ఆనేమాటల్లో ప్రక్కగుండె తియ్యబోయి బాధ, వాపోవడం, మరోప్రక్క మా పాలతో పెంచి పెద్దచేసిన జనం ఎలా తయారయ్యారనే తపనతో, సహజసిద్ధమైన మాతృహృదయం కన్పిస్తుంది

‘పంతులుగారన్నప్పుడుభయపేసింది’, ‘అన్నయ్య అన్నప్పుడే అనుమానమేసింది’ ‘మగమహారాజని ఆడా,మగా వాగినప్పుడే అర్థమైపోయింది ఆనేమాటలు. మొదట ‘భయపడ్డం’, తరవాత ‘అనుమానపడ్డం’ చివరకు ‘అర్థమవ్వడం’ ఈ గేయభావానికి ఒక వరుసను సమకూర్చినట్లైంది. మగమహారాజని ‘ఆడా, మగా’ వాగారు కనుక, జనంలో “సగం” విభజించి పాలిస్తోందని అనవలసి వచ్చింది.

ఇందులో అల్పాక్షర అనల్పార్థ
రచనుంది
వైభవమైన అలంకార
సముదాయముంది
స్పష్టమైన ఈ గేయంలో అచ్చమైన
కవిత్వముంది.

పిట్టకొంచెం కూతఘనంగా చిన్నదైన ఈ గేయంలో అమితమైన భావముంది దీపం చిన్నది_దీప్తి పెద్దది.

* * *

మనుచరిత్ర పునశ్చరణం - 8

# ఉద్యానంలో వరూధిని

— డాక్టర్ మిరియాల రామకృష్ణ

“వరూధినీ! తొందరగా రావమ్మా స్నానంచేసి. అలా వనంలోకి వెళ్ళొద్దాం” అన్నారు చెలికత్తెలు వరూధిని వెంటనే గంగానదిలో స్నానం చేసి వచ్చింది ఆ స్నానవర్ణన అపూర్వం.[1]

ఆ తర్వాత వరూధిని ముస్తాబు చేసుకుంది ఆ ముస్తాబును ముద్దుగా వర్ణించారు పెద్దనగారు కానీ ఆ ముస్తాబుని వరూధిని మనఃపూర్తిగా చేసుకోలేదు సఖులంతా బలవంతంచేస్తే ఆమె కది తప్పనిసరి అయింది [2]

చెలికత్తెలూ వరూధినీ ఉద్యానం (Garden)లో అడుగుపెట్టారు ఇక్కడ పెద్దన, కథను మరొకచోటికి మార్చి మరో దృశ్యం చూపెడుతున్నారు స్థలం ఆ ఉద్యానమే! రంగంమీద ఒక గంధర్వుడు కనిపిస్తాడు ఆ గంధర్వ దేవరంటే అంతకు ముందునుంచీ వరూధిని అందచందాలపై కన్నువేసి ఉన్నవాడు. ఆమెచేత ఇదివరకే తిరస్కరింపబడినవాడు. కానీ మనసులో కోరిక చల్లారనివాడు పైగా మన్మథ విద్యల మర్మాలను కూలంకషంగా మథించినవాడు.[3]

ఆ గంధర్వునికి ఒకానొక విజ్ఞాన విశేషం (Knowledge including skill) ఉంది. ఎక్కడేది జరుగుతోందో తాను చూడకపోయినా ఊహానేత్రంతో చూసే నేర్పది ఇలాంటి నేర్పు నిజంగా ఉంటుందా? అతడు దివ్యుడు కనుక ఆ నేర్పు ఉందన్నది సంజాయిషీ [4]

కామవాంఛల స్వరూపస్వభావాలను చెప్పే శాస్త్రం కామశాస్త్రం [5] దానికి అంగప్రాయమైనది మనస్తత్వశాస్త్రం. ఈ రెండూ గంధర్వుడికి కరతలామలకాలు అతడొక సిద్ధాంతం చేసుకున్నాడు. అది నిజమో కాదో అంటే అతని అవగాహన కది నిజమే ఏమిటా నిజం? ఒక్కొక్కప్పుడు స్త్రీలు పురుషుణ్ని తిరస్కరిస్తారట ఇంకొకప్పుడు అదిరిస్తారట స్థిరమైన మనస్సు స్త్రీలకుండదట అందువల్ల పురుషులు ఉపాయాలతో ప్రవర్తించి, వారిని బుట్టలో వేసుకోవాలట ఈ అభిప్రాయం గంధర్వుడి అవకాశవాదానికి అద్దంలాంటిది [6] ఆ గంధర్వుడికి ఈ ఆలోచన రాగానే ఆ ఉద్యానంలోని ఒక చందనవృక్షం నీడలో నిలబడిఉన్నాడు [7] అతడు తన రూపాన్నీ ఆహార్యాన్నీ

---

అందాపు మన్మథరావు
* తూడి * _ పోష్టు
వీరఘట్టాం _ వయా
శ్రీకాకుళం_జిల్లా
పిన్ ॥ 532 460

...—...

మార్చుకోగల మహావిద్యగల నటుడు లాంటివాడుకూడా కనుక ప్రవరవేషంలోకి నిమిషాలమీద మారిపోయాడు [8] అతని అంతరంగంనిండా ఇంద్రియ వాంఛాతరంగాలున్నాయి కానీ బాహ్య వేషంలో జితేంద్రియుడయిన ప్రవరుడిలాగే కనిపిస్తున్నాడు [9]

ప్రవరుడు అసలు పాత్ర. అంటే అనుకార్యుడు మాత్రమే గంధర్వుడు అనుకర్త (imitator-actor) ఇతనికి తాదాత్మ్యం ఉండదు ఉండకూడదు రససిద్ధాంతం ప్రకారం కానీ అనుకరణశక్తి పుష్కలంగా ఉండాలి గంధర్వుడిలో అది ఉంది [10]

ఇతను మాయాప్రవరుడు శాంతరసం ఒలికే బ్రహ్మతేజస్సుతో నిలబడ్డాడక్కడ అతని ఆహార్యంలో గమనించదగిన అంశాలేమిటంటే నుదుట గంగమట్టి ధరించడం. చెవులకు కుండలాలు పెట్టుకోవడం. జలతారుకండువా వేసుకోవడం, మడిబట్ట కట్టి, తెల్లటి జందెం వేసుకొని. కాశికాముద్రగల ఉంగరం పెట్టుకోవడం మొదలయినవి.[11]

అదే ఉద్యానంలో మరో దృశ్యం వరూధిని విహారం పెద్దనగారు ఆ విహారాన్ని ఆమె నడకల వర్ణనతో మొదలుపెట్టారు [12]

ఆ తోటలో ఎన్నోరకాల పూలచెట్లున్నాయి చల్లనిగాలి, తుమ్మెదలపాటలు, నూతన వసంతం, వెన్నెలలుకాసే చందమామ- గల ఆ ఉద్యానంలోకి ఆ దేవకన్యలంతా ప్రవేశించారు.[13]

ఆ తోటలో చంద్రకాంత శిలావేదికలు (Marble stone sofas) ఉన్నాయి కృత్రిమంగా నిర్మించబడ్డ సెలయేళ్ళున్నాయి వాటినిండా పచ్చటి పూలపుప్పొడి పడుతూఉంది అందువల్ల ఆ సెలయేటినీళ్ళు రంగునీళ్ళు! అవన్నీ పన్నీళ్లు! ఆ రంగురంగుల పన్నీరు (Colourful fragrant water) పాలరాళ్ళ వేదికలమీదికి తుళ్ళిపడుతోంది ఆలాంటి రాతివేదికలమీద ఆ దేవకన్యలు కాసేపు కూచుని కబుర్లు చెప్పుకున్నారని పెద్దనగారి వర్ణన ఈ వర్ణనంతటినీ ఒక నాలుగు పాదాల మత్తేభంలో ఇమిడించిన పెద్దన నిజంగా 'పెద్దకవి' అయిఉండకపోతే అలా చేయలేడు నిజానికిదే ప్రబంధపదగుంఫనం అంటే,[14]

అయితే,వాళ్ల మాటాడుకున్నమాటలు చిత్రవిచిత్రార్థసంపద గలవి అవి సత్యమయినవా అసత్యమయినవా అని తేల్చుకోవడానికి వీలులేదు ఎందుకంటే వారంతా స్త్రీలే అవి వారు అంతరంగికంగా మాటాడుకునే మాటలు [15]

చెలికత్తెలు వరూధినికి సంభ్రమాశ్చర్యాలు కలిగించే 'కవితా ఖండాలు' (Poetic pieces) వినిపిస్తున్నారు వారి కవితావస్తువు ఉద్యానమే. 'సంపెంగపూలు చూశావా అన్నారు వారు 'అవి అరణ్యదేవతల ఇళ్ళలో పెట్టిన దీపాల్లా లేవూ! అన్నారు అంతటితో ఊరుకుంటే కవిత్వం అసంపూర్ణమే! చూశావా వల్లని తుమ్మెదలు చీకట్లలాగా ఈ సంపెంగల దీపాలనుమూసి పారిపోతున్నాయి మరి! అని చమత్కరించారు.[16]

చెలికత్తె లేదోవిధమయిన చమత్కారచలోక్తులతో వరూధిని మనస్సును రంజింపజేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఆ చలోక్తులకు భాషాప్రౌఢిమను జోడించారు పెద్దనగారు సహజంగా ఇది ప్రబంధ సంప్రదాయం. భాషాప్రౌఢిమ అనేక విధాలు అందులో ఇలాంటి సందర్భాలలో 'మధురకవిత్వం కన్నా 'చిత్రకవిత్వం' రాణిస్తుంది ద్వంద్వార్థాలతో చమత్కరించడం చిత్రకవితారీతుల్లో ఒకటి ఒక పద్యంలో రంభ (అరటిచెట్టు, అప్సరసపేరు), తపసి (ఋషి, అవిసెచెట్టు) అనే పదాల శ్లేషను వాడుకుని చలోక్తులు విసిరి పకపక నవ్వుకున్నారు చెలికత్తెలు [17]

ఆ ఉద్యానం చాలా పెద్దది కనుక వారొక మనోహర విశాలతరదృశ్యాన్ని భావించారు అదేమిటంటే- బాగా ఎర్రగా పూచిన దాసానిచెట్లున్నాయి అవి ఎర్రదనం చిమ్ముతున్నాయి మరోపక్కదట్టంగా నల్లగా ఉన్న తమాలవృక్షలున్నాయి అవి నల్లదనం వెళ్ళగ్రక్కుతున్నాయి ఈదృశ్యం చీకటిలో సూర్యోదయం లాగుందట.[18]

తరువాత వారికి పోకచెట్లు కనిపించాయి. వాటిని చూస్తుంటే ఒక దృశ్యచిత్రం (visible image) తోచింది వారికి పోకచెట్ల ఆకులు చామనచాయగా ఉంటాయి వాటి బోదెలు సన్నంగా వరుసలు వరుసలుగా ఉంటాయి పోకకొమ్మలు వారికి మబ్బుల్లాగానూ బోదెలు వర్షధారలులాగానూ ఉన్నాయని వారికి అనిపించింది [19]

తరువాత వారిని మధూక వృక్షాలు (ఇప్పచెట్లు) ఆకర్షించాయి. వాటిని చూద్దామా అనుకున్నారు. ఆ చెట్ల దృశ్య రమ్యత ఏమిటి? ఇప్పమ్రాకులనుంచి ఎండుటాకులూ పూలూ కూడా ఒకేమారు రాలుతూ ఉంటాయి. ఎండుటాకుల రంగు వేరు, పువ్వుల రంగు వేరు. ఎండుటాకుల్లో పువ్వులు పడుతూ ఉండటంకూడా యాదృచ్ఛికంగా జరుగుతోంది. ఆ దృశ్యం చూడగానే ముత్యపుచిప్పల్లోని ముత్యాలు గుర్తుకొచ్చాయి వారికి.[20]

తరువాత వారినాకర్షించినవి అశోక వృక్షాలు. ఆ చెట్ల చిగురాకులు నిర్విరామంగా కదులుతూ ఉంటే ఒక చెలికత్తె అంటుంది కదా "ఈ చిగురాకు మన్మథుని ఆజ్ఞాహస్తం (Commanding hand) లాగుంది కదూ. ఓ పేనల్లారా ఈ విరహులందరినీ గట్టిగా పీడించండి అని చెబుతున్నట్లుంది కదూ" అంటుంది.[21]

ఇంతలో వారికొక మనోజ్ఞదృశ్యం కనిపించింది. అక్కడ మామిడికొమ్మ మీద చిగురాకులు మేస్తూ ఉంది ఒక ఆడు కోయిల. దాన్ని ఒక తుమ్మెద మూతి మీద కుట్టింది. ఆడుకోయిల కువకువలాడుతూ ఏడుస్తోంది గాయానికి తాళలేక. మగకోయిల వచ్చి దాన్ని ఊరడిస్తున్నట్లు పలికిస్తూ చుంబించింది దాని మూతిని. ఇదే దృశ్యం. ఈ సంఘటనమీద చెలికత్తె వ్యాఖ్యానిస్తూ మగవారిని అపహాస్యం చేస్తుంది.[22]

ఇలాంటిదా పూలతోట. అక్కడ పూలు కోసుకోవాలనుకోవడం స్త్రీల విషయంలో అత్యంత సహజం. వరూధినిని అందుకు ప్రేరేపించారు చెలికత్తెలు. పూలు కోసుకుంటూ మౌనంగా ఉంటారా? ఏవో ముచ్చటలాడుకున్నారు. ఆ మాటలన్నీ వనితల మాటలే. అందులో సరసమైన హాస్యముంది. 22 రగడల ద్విపదలతో నడుస్తుంది ఈ పుష్పాపచయ ఘట్టం.[23]

(ఇంకా ఉన్నది)

## అధ్యయన సూచికలు

1 వరూధిని స్నానంచేసిన ఆనదిలో కలువలూ పద్మాలూ ఉన్నాయి. వాటి తేనెలు జాలువారుతున్నాయి. ఆ తేనెల వల్ల ఆనదిలోని నీళ్ళు 'చంద్రకితం' అవుతున్నాయి. ఆ చంద్రకితజలంలోనే ఆమె ముఖం కడుక్కుంది. 'నికటనాక ధునీ కల్హారాంభోరుహ మధురస ధారా చంద్రకిత సలిల క్షాళితాననయై' అని పెద్దనగారి వర్ణన, 65 ప.

2 ఆముక్తాలకి చెలికత్తెలు అలంకార సామగ్రినందిస్తూంటే ఆమె విసుక్కుంటూ చేసుకుంటుంది. ఆ అలంకరణం నుదుటి మీది చుక్కబొట్టును కస్తూరితోనూ, తలకట్టును పూలతోను, పాదాలను రత్నపాదుకలతోనూ అలంకరించుకున్నది. కత్తిరించిన పోకచెక్కలు కొద్దిగా నమిలి ఉమ్మివేసింది. తమలపాకు కొంచెం కొరికి కొరుకుతూ కొరుకుతూ చెలికత్తెల ప్రశ్నలకు జవాబిస్తుంది. ఆమె మానసికంగా ఎలాగుందంటే తెలివికీ మరపుకీ మధ్య కొట్టుమిట్టాడుతోంది. అప్పటికే ఆమె సగమైపోయింది. పాఠకులకంతర రూపే వర్ణన ఈ పద్యం (66)లో సీసపు ఎత్తుగీతిలో కనిపిస్తుంది "సగము గోరిన యాకును సఖులు పిలువ సగము కొసరు సగము తరము తెల్వి సగము మరపు సగము నయి చింతచే సగమాయె చునరిగా''

3 వరూధినిని ప్రవరుడు తిరస్కరించడం కన్నా ముందే గంధర్వుడు వరూధినిచేత తిరస్కరింపబడ్డాడు. అంటే వరూధినీ గంధర్వులిద్దరూ విరహబాధలోనే ఉన్నారు. వరూధినికి గంధర్వుడక్కర లేదు. ప్రవరుడే కావాలి. గంధర్వుడికి మనుష్యులూ అక్కరలేదు వరూధినియే కావాలి. 'కామం' యొక్క రహస్యమిది. కామం కేవలం మనోగతమూ కాదు కేవలం రూపగతమూ కాదు. రూపగతం కావచ్చుగానీ శరీరగతం మాత్రం కాదని రూఢిగా చెప్పవచ్చు ఇక్కడ. వరూధినీ గంధర్వుల విషయంలో కామవాంఛ రూపగతమే. ఇది ఉత్తమగతికి మాత్రం చెందదు (చూ 68 పద్యం)

4 'దేశజాతిక్వ జనితవిమలజ్ఞానపాటవం' అన్నాడు దీన్ని పెద్దనగారు (67)

5. పురుషార్థాలు ధర్మం, అర్థం, కామం, మోక్షం అనే నాలుగూనూ. ఈ నాల్గింటి స్వరూపస్వభావాలనూ చెప్పే శాస్త్రాలు వేర్వేరుగా ఉన్నాయి. ధర్మశాస్త్రం, అర్థశాస్త్రం, కామశాస్త్రం, మోక్షశాస్త్రం (వేదాంతం) వీటిని సరిగా అధ్యయనం చేయకపోయినా పురుషుడు దారితప్పుతాడు. మంచికీ చెడుకీ కూడా ఈ శాస్త్రాలను వాడుకోవచ్చు. గంధర్వుడు కామశాస్త్ర ప్రావీణ్యంగలవాడని దానికి 'అంగభవ విద్యాపారగుడు" అని పెద్దనగారు నొక్కిచెప్పారు. ప్రవరుడు ధర్మశాస్త్ర పారంగతుడు కనుక వరూధినిని తిరస్కరించాడు. గంధర్వుడు కామశాస్త్రజ్ఞానాన్ని "స్వార్థం"కోసమే కాకుండా పరవంచనకోసం కూడా వాడుకోదలచినవాడు.

6 పెద్దన పాత్ర మనస్తత్వాన్ని నిష్పాక్షికంగా చిత్రిస్తున్నాడు. ఇలాంటి

విషయాలను నిత్యసత్యాలుగా ప్రతిపాదించడం కష్టం. స్త్రీ మన స్తత్వం ముఖ్యంగా ప్రేమవిషయంలో ఎలాగుంటుంది అనేది ఎవరెరుగుదురు? నిజానికది స్త్రీవ్యక్తిగత సంస్కారవిషయం. కానీ దీన్ని సాధారణీకరించి (generalising) చెబుతున్నాడు గంధర్వుడు. అయితే స్త్రీవ్యక్తిత్వాన్ని శంకించవలసి ఉంటుంది. గంధర్వుడి వ్యక్తిత్వమే శంకించదగింది నిజానికి. వరూధిని వ్యక్తిత్వాన్ని శంకించనక్కరలేదనేది ముఖ్యంగా తెలుస్తుంది. చూ. 69 'ఒక్కొకకళ పద్మముఖులొల్లమి సేయుదురొక్కొకళ పెన్మక్కువ నాదరింతురుత్తుంగతుంగముల్ జవరాండ్ర చిత్తముల్ పక్కున వేసరన్ జనదుపాయములన్ దగు నచ్చికంబులన్ చిక్కగఁజేసి దాని పతిచిత్తము పట్టి సుఖింపగాదగున్" ఇలాంటి పద్యాలను బట్టి స్త్రీని నీచంగా చిత్రించారని భ్రమపడకూడదు. నిజానికి ఇక్కడ నీచుడుగా చిత్రింపబడుతున్నది పురుషుడే!

7. చూ. 70 పద్యం 'ఒకచందన భూజము నీడనిల్చి దంభంబమరన్'

8 ఇలాంటి రూపానుకరణ విద్య దేవతలకుంటుందనీ రాక్షసులకు కూడా ఉంటుందనీ పురాణాలు చెబుతున్నాయి. దీన్ని కామరూపవిద్య అనడం వ్యవహారంలో ఉంది ఇందులో బాహ్యరూపం మారుతుందే కానీ అంతరంగం మారదు. కానీ వాళ్ళు కూడా ఇలాంటి విద్యగలవారు మార్చుకుంటారు కానీ అంతరంగం మార్చుకోవడ మొక్కటేఅసాధ్యం.

9. ఈమిషతో ప్రవరుడి రూపాన్ని కూడా బొమ్మగీసి చూపిస్తున్నాడు కవి. ప్రథమాశ్వాసంలో ప్రవర రూపవర్ణన చేసిన తీరుకీ ఈ ప్రవర రూప వర్ణనకీ భిన్నత్వంఉంది. ప్రథమాశ్వాసంలో చెప్పని రూపరేఖలే ఇక్కడ కవి చెప్పడం గమనించదగిన శిల్పం. చూ. ప్రథమాశ్వాసం 51 52, 58, 54 పద్యాలు. అక్కడ ప్రవరుడి ఆత్మీయత మనకు గోచరిస్తుంది. ఇక్కడ ప్రవరుడి ఛాయాచిత్రం (Photo) కనిపిస్తుంది.

10 గంధర్వుడ్ని చూసి అతని రూపరేఖల్లో ప్రవరుడ్ని దర్శించి తాదాత్మ్యం పొందుతుంది వరూధిని. ఆమెది స్థాయిభావం. కనుక రసనిష్పత్తి వరూధినిలో కనిపిస్తుంది రసపిపాసాంత సత్యానికి వరూధిని నిదర్శనంగా భాసిస్తుంది.

11 అర్ధచంద్రుని తేట నవఘటించు అలాట పట్టెదిర్చిన గంగమట్టిపోడ అనే సీసపద్యంలో పెద్దనగారి శబ్ద శిల్పం హృద్యం. సీసపద్యాల మూసలకు ఒక ఒరవడి ఈ పద్యం.

12 ఆమె నడకలెలాగున్నాయి? ఈ నడకలను చెప్పనిదే శృంగారావిర్భావం జరగదు ఆమె పాదాలకు మువ్వల అందెలున్నాయి ఆమె నడుస్తోంటే ఝుళం ఝుళరవాలు పుడుతున్నాయి. ఆ ధ్వని హంసలను ఆకర్షించింది అవి ఆమె ననుసరించాయి. రమ్యమైన ఈ వాచ్యార్థం ధ్వనిచేత మరింత రమ్యం. చూ. 72 వ పద్యం_కందం

13 మలయపవనుడు, మరుడు, మధుడు, ఓషధీశుడు _ అక్కడికి వచ్చి సౌందర్యమాధుర్యాలు ప్రత్యక్షరిస్తారన్న 'ధ్వని' సాధించేందుకు పెద్దనగారు పెద్ద శిల్పం ప్రదర్శించారు. ఈ సీసపద్యమంతా ఉత్ప్రేక్షల పరంపర ఎత్తుగీతిలో చెట్లజాబితా, చంపక _ కురవక _ పనస_ తినిశ_నీచుల నంజాల - దాడిమీ_విచికిల_ ఆమ్ర_పాటలీ_పూగ_కేసర మూలని వాటి పేర్లు. చూ. 73 సీసం.

14. ఆ పద్యాన్ని ఉదాహరించడం మంచిది. 'పవమాన ప్లవమాన పంకజ రజః పాళీకింగచ్ఛవి ధవదళ్యర్ణవికీర్ణ కృత్రిమ పరిత్యాగ స్తరంగా కాతైంద్య పాషాణవితర్దికాతలమునన్ వాకీకపత్రావృతులుత్పన్ మెయికప్పన్ విహరించుచున్ సరసవాచాప్రౌఢిమల్ మీరగన్' — పెద్దనగారు తన వాచాప్రౌఢిమనుముందు ముందు నిరూపించుకున్నారిలా ఇక దేవకన్యల వాచాప్రౌఢిమ ఎంత సరసమో చూడాలి.

15. స్త్రీలవక్షోజసంపదలగురించివారి మొదటిమాటల సారాంశం. 'బటువయి విఱ్ఱవీగి పరిపాటిగ పూచి పరాగ పూజ మొక్కొకట కలయంగ పర్వకొనకొమ్మను కోయిల మించ నొప్పు చెంగటి యెలమావి పోరచుచి గందపొడిన్ గనుపట్టి నీలతా స్ఫుట తర చూచుకంబగుచు పాల్పడు చెందిర గుబ్బచన్నున్' 75 పద్యం. ఇష్టమైన పాఠకులు దీన్ని చదువుకుని ఆనందించాలేమోగానీ తిరిగి చెప్పుకోవడం మాత్రం అశ్లీలమే.

16 'కవిసమయం' మీద ఆధారపడిన చతురోక్తి ఇది. చూ. 76 పద్యం.

17. 'అపరిమితానురాగ సుమనోల్లసరాయి చిగురాకు కేతులన్ తపసిని కాగిలించె వనితా ఇదే రంభ '—' తలంప రంభ తానపరిమితానురాగ సుమనోల్లసరాయి చిగురాకు కేతులన్ తపసిని కాగిలించుటుచితంబె కదా యన నవ్వె రంభయున్' అనే ఈ 77 వ పద్యంలో ఒక చెలికత్తె విసిరిన ఛలోక్తినే మరో చెలికత్తె అర్థాంతరం స్ఫురించేలాగ పునరుక్తం చేస్తూ విసరడంతో రంభకు నవ్వొచ్చిందిట. ప్రబంధాల్లో హాస్యం గగన కుసుమం అనే వాదానికి దొరక విరుగుడు. అయితే ఇది ప్రబంధహాస్యం (sense of Humour in terms of classicism) అనడం నిజం నిజానికి లాంటి హాస్యాన్ని రూపాంతరీకరించే

చెప్పే అవకాశం లేదు. అలా పదాలతో చెప్పవలసివస్తుంది కనుక పదాశ్రయ హాస్యం.

18. చూ. 78 ఆటవెలది

19 చూ. 79 తేటగీతి.

20. చూ 80వ పద్యం ఉత్పలమాల.

21 చూ. 8 వ పద్యం కందం

22 ఇక్కడకూడా పెద్దనగారిహాస్య చతురత వెల్లడి అవుతుంది చూ. 'నును జిగురాకు మేయుచు తరి నోరికెంపుల తేటి గుట్టినన్' అనే పద్యం 'సందు సుడి మాయాలుగా మగవారి కృత్యముల్' అని చెలికత్తె చెప్పిపాడుపు

23 పెద్దనగారి దేశకవితాప్రీతికి ఈ రగడ ఒక నిలువుటద్దం. ఇది ఖండగతిలో నడుస్తూ ద్విపద రూపం సంతరించుకుంది. పాదాల ఆద్యంతప్రాసల్లో అంత్యప్రాస క్రమబద్ధంగా ఉంది. ఆ తోట ఈరగడ ద్వారా స్వరూపం మరింత కళ్ళకు కట్టినట్లవుతుంది పావురాల రొదలతో సుగంధాన్నాల, మొల్లల, పొగడల, ప్రియాళువుల, పోదుగుల, అశోకాల, మొగలుల, విరజాజుల,గురివెందల సంపెంగలసురభిళాలతో ఎంతో అందమైన ఉద్యానవనం అది. ఆ రగడ చదివి ఆనందించవలసిందే.

* * *

మిరియాల రామకృష్ణ
25-6-5/3, జయకృష్ణపురం,
రాజమండ్రి-5.

( *.* )



రచనలు వ్రాత తప్పులు
లేకుండ, చదవడానికి
వీలుగా స్పష్టంగా
ఉండాలి.



# కథా కథన చక్రవర్తి కవికొండల

— డా॥ ఎస్. గోపాలకృష్ణమూర్తి

భావకవులలో ప్రసిద్ధులు, ఆంధ్ర Wordsworth బిరుదాంకితులగు శ్రీ కవికొండల వెంకటరావుగారు చారిత్రక ప్రసిద్ధిగల పట్టణముల స్థలపురాణముల శోధను చూచి అనుభూతిపొంది "పెనుమంచిలి జైనదేవుడు" అను కథామణిహారమును రూపొందించారు పూర్వాంధ్ర మహాకవీశ్వరులు ఎఱ్ఱన, శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు స్థలమాహాత్మ్యము అను పద్యకావ్యములుగా రచించి తమ ఆంధ్రదేశాభిమానము ప్రకటించి తెలుగు సహృదయులలో దేశభక్తిని ప్రబోధించిరి. శ్రీ వెంకటరావుగారు, తెలుగు పట్టణముల పుక్కిటిపురాణములను, పామర జనుల జీవితంలోని తీరుతెన్నులను చిట్టిపొట్టి కథలుగా కైసేసిరి కథాకథనము తెలుగుదేశపు గ్రామీణ జీవిత మాధుర్యము, తేనెలొలుకు తెలుగుభాషలో, సజీవ పాత్రచిత్రణముతో సాగిపోవుట నిసర్గమధురము. ఈ కథలకు తెలుగుతనము ప్రాణము.

## 1. పెనుమంచిలి జైనదేవుడు

ఈ కథలన్నియు ఉత్తమపురుషలో సాగినవి. పశ్చిమగోదావరిజిల్లా, పాలకొల్లు దగ్గరనున్న "పెనుమంచిలి"లో పెద్ద రావిచెట్టుక్రింద వెలసిన జైనవిగ్రహము ఈ కథకు కేంద్రబిందువు చరిత్ర పరిశోధన దృష్టికి పామరుల సామాన్య దృష్టికి తారతమ్యము సూచింపబడినది. క్రొత్తఅల్లుడు అత్తవారింటికి వచ్చినపుడు ఆ ఊరిలోని వారందరు ఆప్యాయత, ప్రియురాలు సోగచూపులతో ఒయ్యారముతో భర్తను కలుసుకొన్న విధము మధురము. పరిశోధకుడు ప్రస్తుతపరిస్థితులను బట్టి, పూర్వము స్థితి నిర్దేశించుట, ఇప్పుడున్న స్థితి భవిష్యత్తులో ఎట్లు మారునో తెల్పుట చేయవలెనని సూచించుట మనోహరము. "కళ"ను గూర్చి కవి అభిప్రాయము "కళ మాటగట్టితే ఉండదు. కుడిస్తేనే ఉంటుంది.ఇది ఆలోచనాత్మకము.

## 2 శ్రీరంగపట్టణపు వడువీధి పెరుమాళ్ళ స్తంభము

విజ్ఞానశాస్త్రము, రవాణా సౌకర్యాలు, చదువుసంధ్యలు లేని పల్లెప్రజల మూఢవిశ్వాసాలకు ఈ కథ అద్దాలమేడ

ముష్టికి నష్టికి కాకుండ జబ్బుపుష్టి కొలది డప్పు వాయించి ఆ ఊరివారందరిని వాడలుకొట్టిన విధము అద్భుతముగా నడచినది. ఈనాడు నక్సలైట్లు పేరు చెప్పి అమాయక ప్రజలను గడగడలాడించుచున్నట్లే, ఆనాడు బందిపోటు దొంగలు ప్రజలను దోచుకొన్న విధము సూచితము. ప్రజలందరు బ్రతికివుంటే బలుసాకు తినవచ్చునని పారిపోగా ఒక పురుటాలు అప్పుడే పుట్టిన పసికందుని విడిచి వెళ్ళకపోవుట మాతృప్రేమ దొడ్డది. కథకోసం చెవి కోసుకొను విధముగా నడచినది ఈ కథావాహమున రచయిత వ్రాస్తూన్నపుడు, నా చేతివ్రాలతో నేను చిదానందం పొందుతానన్నది ముఖ్యము.

## 3 అచంటేశ్వరుడు

ఈ కథ తత్త్వజిజ్ఞాసను పాఠకునిలో కలిగించుచున్నది. పశ్చిమగోదావరిజిల్లా

పాలకొల్లు దగ్గరనున్న ఆచంట గ్రామంలో స్తనాకృతిలో నున్న శివలింగము నల్లరాయి, ఆరాతిపై చూచుకము, చెమరింపు, పూజచేసిన పూలు వాడని దృశ్యము ఒక సన్యాసిలో కలిగిన విచారధార పరమార్థము గ్రహించుట భౌతిక ఉపకరణముల కోసము పాకులాడవద్దు. మనస్సాక్షి యొక్క అంతర్జ్యోతి తనంత కొడిమలుపుకొని కొమరుమీద కొండంత దివ్వెగా ప్రజ్వలిస్తుంటే బాహ్యవస్తువు లెందుకు. ఆత్మజ్యోతి శక్తిని బహుమున్ని తముగ ప్రబోధించిన దివ్యమైన కథ "ఆచంటేశ్వరుడు".

## 4 కావవరపు చెరువులో కోరుకొండ నరసింహస్వామి పీటపీడలు

ఈ జగత్తంతా సర్వేశ్వర ప్రతిబింబమయం. దీనికోసం ఈ కథ పుట్టుకొచ్చింది. నిరాహారులు, వాయుభక్షులు, సర్వభూతములందు సమరసభావం కుదుర్చుకోడం పెద్దగొప్పకాదు దానికి ప్రకృతి, తల్లిదండ్రులు, పుస్తకములు వడ్డించిన విస్తరిలా తోడ్పడుచున్నవి. చదువు సంధ్యలు లేని ఒక బెస్తవాడు, కోరుకొండ నరసింహస్వామి దేవాలయ శిఖరపు నీడ కాపవరపు చెరువులో చూచి, చేపలు పట్టుట మహాపాపమని గ్రహించుట కథలో కొసమెరుపు.

## 5 సనాతన రాజరాజనరేంద్రుడు

ఆంధ్ర భారతము ప్రసాదించిన నన్నయభట్టారకుని పోషించిన మహానుభావుడైన రాజరాజనరేంద్రుని కీర్తికి కళంకము ఆపాదించుట ధర్మమా? దానికి రచయిత పొందిన ఆవేదనయే ఈ కథకు మూలము. పురాణకథలను తమ ఇష్టము వచ్చినట్లు మార్చరాదు. చెడ్డను వ్యాపింపచేయుట కొంతమందికి వృత్తి. పురాణాలు పనికిరావనను. నిజంగా వాటి వల్లనే కళ లోకంలో అభివృద్ధి అవుతుంది. కాని ఆ పురాణాలకు సంబంధించిన ఆదిమ గాథలను అతి ఇదిగా మార్చి ఒక కట్టడము, విగ్రహము కట్టి ఇది చిత్రాంగి విగ్రహమని చెప్పుట అనవసరం. వృథా వ్యయం. ఈ అభిప్రాయము మెచ్చ తగినది.

## 6 తిమ్మజగపతిరాజు - ధీరగుణభోజ

శరన్నవరాత్రులలో పూర్వము వీధి బడులలో పిల్లలచే గిలకలు పట్టించి, ప్రతి ఇంటికి వెళ్ళి దసరాపద్యాలు చదువు ముద్దుముచ్చటలు ప్రతిపద రమణీయముగ వర్ణించిరి. తెలుగుపిల్లల ధీరత్వకాంతు లదర్శప్రాయము.

## 7 కన్నప్ప కల

రచయిత ప్రయాణము, కన్నప్పతీరుని కలయు శ్రీ కాళహస్తి దేవాలయముగ రూపొందుట కథ. ఇంగ్లీషులోని Travel essay ని పోలియున్నది.

## 8 శ్రీ వేదవల్లి తాయారమ్మాళ్

కన్నప్పనుబట్టి ఒక మహాదేవళం వెలసినట్లే భగవద్భక్తుడైన చన్నప్ప పేరను ఒక మహాపట్నం ఎలా పెరిగిందో తెలిసిన మహిమాన్విత కథ మద్రాసుకు చెన్నపట్టణముండెడిది ఆ చన్నప్పకు జ్ఞాపక చిహ్నమేదియు లేదని రచయితకు చన్నప్ప చెప్పిన కథ రమ్యము.

## 9 గంధం పొలుపు వేలుపు

ఈ కథ సింహాద్రి అప్పన్నమీద నడచిన కథ. భాషాశాస్త్రము మనసులో నుంచుకొని నడచినది. శ్రీ సింహాచలస్వామిని, సింహాద్రిఅప్పన్న, అనబుద్ధి వేస్తుంది. అచ్చతెనుగు శబ్దమైన అప్పన్నను తీసికొని, నరసింహంతో (సంస్కృత) ముడిపెట్టి అప్పన్నరసింహం అని అంటారు. సంస్కృతంమీద ఆంధ్రం నెత్తెక్కింది. అచ్చోసిన ఆంబోతును అప్పన్న అంటారు. సింహాచలంను వరాహావతారం, నరసింహావతారం ఆశ్రయించాయి. గంధపుపూతలో అసలు రూపము చూడలేక అల్లాడిపోతుంటే, అది పావనుని చేరి తన డెక్కలో గంధం తొక్కించి ప్రజలకు స్వామిదర్శనం చేయించింది.

## 10 అధర సుధారసము

మంగళగిరి పానకాలస్వామి మహత్తును సుకుమారముగ, శృంగారశైలిలో సూచితమైన మృదుమధురమైన కథ. విరజాజి మాణిక్యం విభునితో, నేను మీకు పెదవి పూర్తిగా అందిస్తూవుంటే సగం దగ్గరకే కోతి వదిలేస్తూ వుంటారేమిటి పానకాలస్వామి వారిలాగు. విరజాజి మాణిక్యం శభాలీతనం, చమత్కారము అనితరసాధారణము. తెలుగుదేశపు పెంజాణతనము, భర్తృవాల్లభ్యము, చతుర సంభాషణము లలితకోమలము. కాళిదాసు గారి ప్రియంవద, మునిమాణిక్యంగారి కాంతము సరసన కూర్చుండతగిన పాత్ర విరజాజి మాణిక్యము.

కుటుంబములోని సభ్యులందరు కూర్చుని చదువుకొని, ఆనందించుటకు అనువుగా కథలను శ్రీ కవికొండలవారు ప్రసాదించారు తెలుగుతనముతో ఈ కథ లన్నియు అలరారుచున్నవి నిజముగ కథలకొండ కవికొండల అని చెప్పవగును.

* * *

ఎన్. గోపాలకృష్ణమూర్తి,
తెలుగు లెక్చరర్,
46-18-19, దానవాయిపేట,
రాజమండ్రి-533 103.

0 0

# రంగారావు "వర్తమాన శిఖలు" - పరామర్శ

—శ్రీ పాతూరి రఘురామయ్య

'వెలుగులో ఈ నేలపై' అనే కావ్యంలో 'వర్తమాన శిఖలు' అన్నది రెండవ భాగం డా॥ జి వి సుబ్రహ్మణ్యంగారు 'వెలుగులో ఈ నేలపై' అనే సంపుటాన్ని 'దీర్ఘ కవిత' అని పిలుస్తూ లఘు కావ్యంగా వ్యవహరించ వచ్చునని సూత్రీకరించినారు 'లాంగ్ పోయెమ్' అని ఆంగ్ల వ్యవహారం. ఈదృష్టిలో 'వర్తమాన శిఖలు' దీర్ఘ కవితలోని ఒక భాగం. ఇది వెలుగులో ఈ నేలపై అన్న కావ్యంలో సమయ స్పందనాన్ని అనుసరిస్తూ ఆవిష్కరింపబడిన కవిత.

ఈత చెట్లవ మళ్లే
అంవిరబోసుకొని తలలు
మహావేగ ధురామతి
చేతిలో కాగువలె
ఆశ్చర్యకరంగా భయానకంగా
దూసుక పోతున్నాయి క్షణాలు!

క్షణాలు కదలిపోవడాన్ని కవి ఈ విధంగా తీర్చడంలో సమయం చాల వేగవంతమైనదనీ ఎందుకు చెప్పాలి?

స్వాతంత్ర్యం వచ్చి ఇరవై అయిదేళ్ళు ఇంతలోనే గడిచిపోయాయని ఆశ్చర్య పోవటమూ లేదు. ఇంత సేపు ప్రయాణం చేసి ఒరగబెట్టినదేమిటి?' అని ప్రశ్నించారు కవి. అంటే ప్రజల బ్రతుకులలో నిమిత్తం లేకుండా కదిలిపోతూంది సమయం అంటూ బాధపడడమే అంతరార్థంగా, మిగిలిన క్షణాలనయినా వినియోగ పరచుకోవాలన్న భావం ధ్వన్యర్థంగా, 'ఆశ్చర్యకరంగా, భయానకంగా' అన్న పదాలలో ప్రస్తుత దుస్థితి వాచ్యార్థంగా వ్యక్తీకరించడం జరిగింది.

రంగారావుగారి కవిత్వం అంటే చాలు భయపడే లక్షణం కూడా పాఠకులలో కొంత ఉంది. నిజానికి రంగారావు కవిత్వం క్లిష్టమైంది కాదని చెప్పడానికి పైఖండిక ఒకటి ఉదాహరణగా చెప్పుకోవచ్చు మహావేగ ధురామతి అన్న పదబంధం రంగారావుగారు స్వయంగా కల్పించుకున్నది మొదటి రెండుపాదాలలోని బింబం కవి కావ్యబింబాను స్పృశ శక్తికి ప్రాతినిధ్యం వహిస్తున్నది గోజులకు తలలు విరబోసుకునే ఈత చెట్లతో పోలిక చెప్పడంలో కవి కల్పనాచాతురి వ్యక్తమైంది వర్తమాన కాలస్వరూప వివేచన ఈ దీర్ఘ కవితలో సాగింది. ఒక క్షణాన్ని 'అడవిలో జంతువుపైకి లంఘించనున్న సింహం'గా, మరొక క్షణాన్ని 'శత్రు సమూహంపై ప్రేలనున్న మెషిన్ గన్'గా చిత్రీకరించడంలో ఘర్షణసజీవుడైన మానవుడు ఉనికికోసం చేసే ప్రయత్నంలో అంతర్విభాగమే నన్న భావం వర్తమానస్థితి సందర్భమును వివరిస్తూ చెప్పినది అయితే ఆ రెండు 'క్షణాలను కలిపే రేఖ'గా అధునిక మానవుడిని గూర్చి చెప్పాడు.

"ఈ క్షణాల ముఖాలలో గాయాల లోతులూ, నెత్తురు కాల్వలూ (ఈనాడు సాగుతున్న విపన్నస్థితిలోని విశేషాలు) ఒక నాటికి రావచ్చునేమో ఇవన్నీ గుర్తింపుకు, అలంకార చిహ్నాలుగా సౌందర్య మర్యాదలుగా' అన్న కవిలో సేటిహింసా పదముద్రలన్నీ కూడా ఒక నాటికి అనందాన్ని ఇవ్వగల, అహ్లాదచిహ్నాలుగా మిగులుతాయన్న ఆశ అంతర్లీనంగా ఉంది. భారతకాలం నాటి యుద్ధగాథలలో మన మిప్పుడు ఆనందిస్తున్నట్టు. కాలం గడిచి పోతున్న కొద్దీ గతంలోని అవశేషాలను మళ్ళీ మనం ఆదరించవచ్చును. వాటి ద్వారా అహ్లాదం పొందవచ్చును. కవికి భవిష్యత్తును సువర్ణఖండంగా ఊహించేటందుకే ఈ వర్తమానకాలాన్ని దర్శిస్తున్నాడు

యజ్ఞ వేదులనుండి సాగిన
వినీల ధూమజటాచ్ఛటలతో
మెరుగెక్కిన ఆకాశం,
యాంత్రిక నిర్మాణ శిఖరాల నుండి
వినీల ధూమపంక్తులతో
ఇపుడు కనిపిస్తూంది కంటికి.

కాలాన్ని ఖండఖండాలుగా చూడటం కవి ఉద్దేశ్యం కాదు. అందుకే ప్రజాజీవన ప్రస్తుతస్థితిని ఆకాశంతో పోలుస్తూ దానిలో గతకాలపు ప్రభావాన్నీ, వర్తమానకాలపు ప్రభావాన్నీ కవితామయం చేశారు కవి. రంగారావుగారి కవిత్వంలో అండర్ టోన్స్ ప్రయుక్త మవుతాయని సుప్రసన్న వివరించారు. ఇది రంగారావు కావ్యవైశిష్ట్యంలోని ఒక భాగంగా గుర్తించే వీలున్నది. ఉదాత్తమైన గంభీరమైన శిల్పనిర్మితి రంగారావు కవిత్వానికి ప్రాణం

ఇంత సేపు ప్రయాణం చేసి
ఒరగబెట్టిందేమిటి?
వాలి కేళ్ళ కేవో ఘనకార్యాలు
వెలగబెట్టలేదనీ కాదు
తాబేళ్ళవలె వెలసిన పరిశ్రమలూ,
భుజగాలవలె వెలసిన ఆనకట్టలూ.
తెల్లవారినట్టే ఉన్న బ్రతుకులూ
ఎక్కడ వేసింది అక్కడే ఉన్న గొంగళి
ప్రజాస్వామ్యాన్ని స్థాపితం చేసి
ఎన్నికలూ
వెలుగునీడల క్రీడలాదే రాజకీయాలూ,

'కాలేశ్వరలె' అని చెప్పడంలో కంటిగా నడిచే స్వభావాన్ని బహిర్గతం చేస్తూ పారిశ్రామిక రంగంలోని కార్మికుల దుఃఖాన్ని చూపిస్తున్నాడు. 'భుజగాలవలె' అనడంలో ఆనకట్టలు సర్వజన సుఖదాయకాలుగా లేకపోయాయనే ఆవేదన వ్యక్తంచేశాడు. రాజకీయాలు మానవుల బ్రతుకులతో ఆటలాడుతున్నాయన్న సత్యాన్ని విశదంచేస్తూ చివరిపాదం శోభిస్తున్నది. ఇంతగా కళామయంగా చెప్పగలవాడు గనుక 'సాహిత్యవివేచన''లో సుప్రసన్న ఈ విధంగా రంగారావుగారి గురించి అన్నారు 'పరమ భావుకుడు, మననశీలి కవిత్వాన్నెపుడూ వాచ్యంచేయని శిల్పంలో నేర్పరి' ఇట్టి శిల్పనైపుణ్యం రంగారావు కావ్యప్రయోగాలలో మెరుస్తున్నది.

కవి జనంలో ఉన్న అజ్ఞానాన్ని మంచు తెరలతో పోల్చి చెప్పడంలో ఔచిత్యం ఉంది. ఈ తెర సూర్యునికి ప్రపంచానికీ మధ్య పిలువని పేరంటంగా వచ్చి నిల్చుందనడంలో వ్యంగ్యం స్ఫురిస్తున్నది. ఈ అజ్ఞానం మనిషికీ మనిషికీ మధ్య దూరాన్ని పెంచేసింది. సందులేకుండా దారుల్ని మూసినదనడంలో, వెండిపూతతో ఆశల్ని నిలిపిందనడంలో ప్రతీకాత్మకత భాసిస్తున్నది. వెండిపూత కపటవేషానికీ, దారి మూయడం అవరోధానికి ద్వేషాదిభావాల్ని రగుల్కొల్పడానికీ ప్రతీకలు.

'ఎముక ముక్క నోటకరచుకొని
అటూ ఇటూ చూసి మూడకుండా
శ్మశానంలో అప్పుడే చల్లారిన
నిప్పురవ్వల కళ్ళతో
పరుగిడుతోంది కుక్క'

అవకాశవాదంతో స్వలాభాన్ని చూసుకునే మానవుని మనస్తత్వంపై ప్రతీకాత్మక భావచిత్రంలో ప్రతిఫలించింది. కుక్క (స్వలాభాపేక్ష విపరీతంగా గలవాడు) వదిలే అర్పుత అంతా పై ఖండికలో అక్షరశిల్ప సహితంగా సృష్టీకరింపబడింది.

వడ్డీ వ్యాపారివలె
నిలబడింది ఈక్షణం
ముఖంపై మంచు ముసుగుల చాటు
నుండి
బయల్పడిన రహస్యపులోయలతో.

మానవ మనస్తత్వాన్ని నిశితంగా పరిశీలించి, దాన్ని ప్రదర్శించడంలో కవి మానవీయ భావాన్నే వ్యంజింపజేస్తాడు వడ్డీవ్యాపారి ముఖంలో ఉన్న 'రహస్యపు లోయలు' అతనిలోని అనేక భావనలకు ప్రతీకలు. సమయానికి మానవతలవాణాన్ని ఆరోపించడం శిల్పప్రతిభకు సంకేతం.

మైదానాల్లోనుండి
పల్చని మంచు కండువా కప్పుకొని
వంకరలు తిరిగిన దారులగుండా
సన్నని కాల్వలో పడవలవలె
వచ్చే పాలవాండ్రూ, కనివాండ్రూ.

ఇది ఉదయాన్నే ప్రశాంతమైన మనస్సుకు కనిపించే మొదటి దృశ్యంగా కవి స్పష్టంచేశారు. కందుర్తి ప్రవేశపెట్టిన సాధారణ కవితకు అసాధారణ శిల్ప సమన్వితిని జోడించే ప్రయత్నం రంగారావు కవితలో ఉందనడానికి ఇదొక ఉదాహరణ. కార్మికులను కూలివాళ్ళను పడవలుగా వర్ణించడం అపూర్వంగా సాగుతున్నది. పల్చని మంచు కండువా వారి దైన్యాన్ని వ్యక్తీకరిస్తే వంకరలు తిరిగిన దారులు వారిజీవన స్థితిగతులకు ప్రతీకలుగా నిలుస్తాయి.

చీకటి వ్యాపారం విరివియై
వెలుగు గింజ కరువౌతోంది
బిచ్చగాండ్ర చేతి కంచాల్లో
రొట్టెముక్కలు, అన్నపు ముద్దలు
అక్కడక్కడా పచ్చని నేలవలె.

కవి సామాన్య జనుల్ని, ఆర్తులను గురించి వ్రాయకతప్పలేదు. 'వెలుగు గింజ కరువు కావడం' చీకటి వ్యాపారం ఫలితమే. గింజల్ని కొట్లో దాయడం వల్ల జనం తల్లడిల్లిపోవడం ధ్వన్యార్థంగా గ్రహించవచ్చు. మానవీయంగా కవిపడే అవస్థలోనుండే ఇట్టి భావబింబాలు ఏర్పడతాయి. 'అక్కడక్కడా' అన్న ఒక్క పదంతో వారి దైన్యస్థితిని స్ఫురణకు తెస్తాడు కవి. 'కడ్డున విసరబడి ఆగిన ఆకులవలె దిగోవిలువల బ్రతుకులు' అనడంలో నగరంలోని అనాథలు గడిపే పేవ్ మెంటు జీవితాలు స్ఫురిస్తాయి.

'ఎదిగిన మనిషిలోని అడవి' అన్నది మానవుని మనఃప్రపంచమే. ఇందులో విచిత్ర ధ్వనులతో కూడిన ప్రాణిస్వరూపాలు అనేకమైన కాంక్షలకు, భావనలకు ప్రతీకలుగా ప్రయుక్తమైనవి.

ఒకరిమీసుగుపై మరొకరికి కల్లమాలిన ప్రేమ! అనడంలో మరొకరిని అనుకరించడం అనుసరించడం వ్యర్థమని సూచిస్తున్నాడు. చీకటిని ఒక పెద్ద ముసుగుగా వ్యక్తీకరించిన కవి-

'దీన్ని తీయడానికి
ఒకదిశనుండి నిరంతర యత్నం
దీన్ని కప్పివేయడానికి
మరోదిశనుండి అవిచ్ఛిన్న యత్నం'

చీకటి(అజ్ఞానం-భ్రమ-భ్రాంతి-అంధవిశ్వాసం)ని తొలిగేయడం ప్రగతికిమార్గం వేయడం. దీన్ని కప్పివేయడం ప్రగతి నిరోధకత్వానికి పాటుపడడం. ప్రపంచలోని ఈ ఇరువర్గాలను ప్రతిబింబించకుండా ఏ కవీ కవిత వ్రాయలేడు. ఈ ఇరువర్గాల ఘర్షణే జీవిత స్వరూపంగా చరిత్ర నిర్మాణమవుతుంది.

ప్రొద్దుపొడుస్తూండగానే
లేచిచూస్తే -
సుళ్ళు పొగలు కళ్ళముందు
లేచి నడిస్తే -
మూళ్ళతివాసు కాళ్ళక్రింద.

సుకృపాగలు దృష్టిని కలుషితంచేస్తే, సుకృతీలలు అకలలాగా మనిషిని కంటికాన్ని చేస్తాయి. కవితమయిన వాస్తవమే సుకృతీవ, ప్రతిరోజూ 'ఒక తెంపరె' ఎదురైనా దీన్ని గురించి పతమతమయ్యే లోపలే 'వరదలలో ప్రాణి' లాగా వెళ్ళిపోతుందంటాడు కవి

భవిష్యత్ శ్రేయో సమాజంలో అర్జనతో మానవతా అత్యం, క్రమంలో అనంతోత్సాహం రావలసిఉందని గుర్తించిన కవి గమకనే యాజమాన్యం శ్రామిక వర్గం మధ్యవిక్యతను భావించినాడు. సంకుచిత మనస్తత్వంతో, తనను గురించీ వ్యక్తి ఆలోచనను కార్యాన్ని సాగిస్తున్నాడంటాడు కవి 'నిప్పులవూచే' అన్న ఒక్క విశేషణంతో మానవుడిలోని అనల గతి స్వరూపం భావితమైంది వ్యంగ్యంగా నీతినియమాల్లో కొట్టుక చచ్చేవాడిని గురించీ కవి స్పష్టంగా అభిప్రాయం ప్రకటించినారు

ప్రభుత్వాదాయం కోసం ఒక సీసా (సారాయి) ఖాళీచేయడం, ఆపైన మూడుగంటల సినిమా చూడడం కర్తవ్యంగా ఒక అమాయకుని (హోటల్ వర్కర్) ఐదు ఒకట్లనోట్ల పిడికిలి కదలిందని చెప్పిన సందర్భాన్ని కవి కళాత్మకంగా తీర్చిదిద్దడం జరిగింది ఇలా వ్రాయడంలో కవి శ్రామిక జనంపట్ల ఉదార వైఖరిని అవలంబించడమేకాక వాస్తవికంగానూ స్థితిచిత్రణం చేయడం జరిగింది

'విద్యార్థుల చేతుల్లో సాదరత్నలు
అధ్యాపకుల మతుల్లో రాజకీయాలు.

ఈ ఇద్దరివెనకా, తెల్లని గోడల మీదా వివిధవర్ణాల కుంచెల దృక్పథాలతో రాజకీయ పక్షాలు ఢీకొంటున్నాయనీ కవి చెప్పారు. యువకులను 'నినాదాలతో నర్తించే అగ్నులు' అనీ వర్ణించాడు. ఈస్థితినే చిత్రీకరిస్తూ

అరచే వాడికీ
పాడిచే వాడికీ
దొరుకుతూంది అగ్రతాంబూలం
జరుగుతూంది వీరసన్మానం!

కవి 'ఎంతగా అధునికుడో అంతగా సంప్రదాయ బలం ఉన్నవాడు' అని సుప్రసన్న వివరించారు ఈసందర్భంలో తాంబూలం దొరకటం, సన్మానం జరగటం అన్నవి సంప్రదాయభావనా శక్తిలోంచి కవితోడితెచ్చుకున్నవి

క్రియాశీలానికి ఇస్తూ ఉత్తేజం
రావాలి ఉదాత్త సంస్కారం
కూర్చుకొని జాతిశ్రేయస్సు
పొందుతూ మనోవికాసం

జీవితాన్ని ప్రయాణంగా భావించే కవిగా మాదిరాజు స్వేచ్ఛా పిపాసను కలిగి ఉన్నాడు. విశ్వశ్రేయస్సు, జాతిశ్రేయస్సు పైనే ఆధారపడి ఉందన్న సత్యాన్ని ప్రకటించిన కవి మానవీయ భావశిఖరాలవంటి కావ్యాల్ని వ్రాయగలిగినాడు. అట్టి ఉన్నత భావభరితమైన కావ్యఖండమే 'వర్తమాన శిఖలు'_

(శ్రీమాన్ కె. వి రామకోటిశాస్త్రి గారు అధ్యయనం విషయమై ఎంతో ప్రోత్సాహాన్ని ఇచ్చినారు వారికి కృతజ్ఞతలు)

* * *

పాతూరి రఘురామయ్య
సహకార కళాశాల
రుద్రంగి-505 307
జిల్లా, కరీంనగర్

0—0

## యాజమాన్యము - వివరములు ఫారం IV (See rule 8)

"సమాలోచన" జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

| | |
|---|---|
| ప్రకటించు స్థలము | రాజమండ్రి |
| ప్రచురణకాలము | ప్రతి 1, 16 తేదీలు |
| ముద్రాపకుని పేరు | శ్రీ బి. రవికాంత్ |
| పౌరసత్వము, చిరునామా | భారతీయుడు, 6-4-24, ఇన్నీసుపేట, రాజమండ్రి-1 |
| పబ్లిషరు పేరు | శ్రీ బి రవికాంత్ |
| పౌరసత్వము, చిరునామా | భారతీయుడు, 6-4-24, ఇన్నీసుపేట, రాజమండ్రి-1 |
| సంపాదకుడు | శ్రీ బి రవికాంత్ |
| పౌరసత్వము, చిరునామా | భారతీయుడు, 6-4-?4 ఇన్నీసుపేట, రాజమండ్రి-1 |
| యజమానుడు | శ్రీ బి రవికాంత్ |
| చిరునామా | 6-4-24, ఇన్నీసుపేట రాజమండ్రి-1 |

నేను (బి రవికాంత్) పైన ఈయబడిన వివరములన్నియూ యథార్థములని ప్రకటించుచున్నాను.

(సం) బి. రవికాంత్

# అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో అద్భుత వర్ణనలు

—డా॥ పొన్నా లీలావతమ్మ

శృంగారం నవరసాలలో రసరాజంగా ప్రసిద్ధికెక్కింది "ఏకోరసః శృంగార ఏవ" అని లాక్షణికులు శృంగార రసానికి అగ్రస్థానం ఇచ్చారు. శృంగారం లేనిదే ఈ జగత్తే లేదు ఈ సృష్టిలో సర్వజీవరాసులూ తన్మయీభూతులయ్యేది ఒక్క శృంగారరసంలోనే. అందుకే మన పూర్వకవులు తమ కావ్యాలలో శృంగార ఘట్టాలను విధిగా వర్ణించేవారు. శృంగారవర్ణనలు లేని కావ్యాన్ని నీరసకావ్యమని రసికావతంసులు పెదవి విరుస్తారు కాబట్టి సర్వజన సమాదరణీయమైన శృంగారరసాన్ని ఆనాటి కవులు తమ కావ్యాలలో తనివితీర పోషించి తమ కాలంనాటి రాజులను పండితులను మెప్పించారు. అలాంటి కవులలో మేటిఅయిన శ్రీనాథుడు శృంగార శ్రీనాథుడుగా, స్త్రీనాథుడుగా సాహిత్య ప్రియులచే కీర్తించబడుతున్నాడు.

ప్రేమరసైకమూర్తులైన ప్రేయసీ ప్రియుల అందచందాలు, వారి సంయోగ వియోగాలు, చెలికత్తెల ఊరడింపులు, పరిహాసాలు మొదలైన శృంగారఘట్టాలను అద్భుతంగా వర్ణించడంలో పూర్వకవులకు తీసిపోనివిధంగా మన పదకవితా పితామహుడైన తాళ్ళపాక అన్నమయ్య కూడా తన సంకీర్తనల్లో శృంగారాన్ని అతి మేలంగా వర్ణించాడు. అందుకే అన్నమయ్య శృంగార, అధ్యాత్మ సంకీర్తనలను ఆపోశన పట్టిన పండిత విమర్శకులు కొందరు "అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనలను చదివితే ఎంతటి భోగి అయినా యోగి అవుతాడని, శృంగార సంకీర్తనలు చదివితే ఎంతటి యోగిఅయినా భోగి అవుతాడని" చమత్కరించారు అలాగే మరికొందరు "అన్నమయ్య శృంగార సంకీర్తనలు కట్టి బూతుల బుంగలు" అని కూడా నిరసించారు.

అన్నమయ్య రచించిన శృంగార సంకీర్తనలను గూర్చి ఇలా ఎవరు ఎన్ని విధాలుగా విమర్శించినా, చమత్కరించినా, శ్లాఘించినా అందులోని పరమార్థం మాత్రం ఒక్కటే అది ప్రకృతి పురుషులైన జీవాత్మ పరమాత్మల ఐక్యం. అదే అమలిన శృంగారం మానవ మనస్సులను తాత్కాలిక ఉద్రేకాలకు గురిచేయక ఆనందసాగరంలో ముంచి తేల్చే నిశ్చలమైన దివ్యశృంగారం ఇది

అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని ఆదేశానుసారం ప్రజలలో విష్ణుభక్తిని వ్యాపింపజేయదలచి భువిపై అవతరించిన పరమభాగవతోత్తముడు. కాబట్టి పండితులకు మాత్రమే పరిమితమయ్యే పద్య రచనలను చేపట్టక రాజు మొదలు గోపాలుర వరకు అందరినీ అలరించగల సంగీతాత్మక ప్రక్రియ అయిన పది రచనలను చేపట్టాడు. సాధారణంగా మానవులందరూ ఇష్టపడేది శృంగార రసమే అని అన్నమయ్య భావించి ప్రజల మనస్తత్వాన్ని అవలింపు చేసుకొని శృంగార రసాత్మకంగా సంకీర్తనలు రచించి వుండవచ్చు. ఆదిదంపతులు, జగన్మాతాపితరులైన అలమేల్మంగా శ్రీనివాసులను తన సంకీర్తనలకు కవితావస్తువుగా గ్రహించాడు. లోకాతీతమైన దివ్యనాయికానాయకుల ప్రణయాన్ని మనోహరంగా వర్ణించి పాఠకులను మధుర భక్తిమార్గం వైపు మరలించాడు. భక్తుడు ప్రేయసీ ప్రియ భావంతో భగవంతుని ఆరాధించి తపించి ఐక్యం కావడమే మధురభక్తి. ఈ భక్తిమార్గంలోనే గోపికలు, రాధ, గోదాదేవి, ముల్ల, తరిగొండ వెంకమాంబ మొదలైన భక్తురాండ్రు తమ తనువులను, మనస్సులను పరమాత్మకు అర్పించి, ఆరాధించి, ఆనందించి తమ జీవితాలను తరింపచేసుకున్నారు. వైష్ణవ భక్తి సంప్రదాయంలో విష్ణువు ఒక్కడే పురుషుడు. తక్కినవారందరూ స్త్రీప్రాయులే. అందుకే అన్నమయ్యకూడా ఒక్కొక్కసారి తానే ప్రేయసిగా మారి స్వామిని ప్రియుడుగా భావించి ఆరాధించి తన సర్వస్వాన్ని అంకితంచేస్తాడు. ఈ భావాన్ని వ్యక్తంచేస్తూ అన్నమయ్య-

మచ్చికల మగసిరిమందులాడ నీ
కిచ్చిన దేహమిది యెట్టయిన జేయరా ॥
ఓడక యొక్కడనైన నుండి నీవు
వేడుకతో మాయింటికి విచ్చేయగాను
వాడుమోముజూచి నవ్వువచ్చుగాని కోప
మేడదచ్చుకొన్నరాదు యెట్టైనాజేయరా

ఎంత పొద్దుపోయియైనా యిటు నీవు
చింతలేక మాయింటికి విచ్చేయగాను
చింతలో నీ కెదురుచూచితిగాని
యెంతైనా కాయలేను యెట్టయినా
జేయరా ॥

వంపుమచెక్కుల మెలుగులతోడ తిరు
వేంకటేశ మాయింటికి విచ్చేయగాను
వంకలాడి నిను గూడవలెగాని
యింక నిన్ను పాయలేను యెట్టయినా
జేయరా ॥

అనే సంకీర్తన రచించాడు.

భగవంతుడు అందరివాడు. ఏ ఒక్కరికీ స్వంతం కాడు అందుకే ప్రేయసీ రూపంలోఉన్న మన అన్నమయ్య తన

ప్రియుడైన శ్రీ వేంకటేశ్వరుడు ఇతర స్త్రీలనుకూడి వలంచిన్నాతో ఇంటికి వచ్చినా ఏమీ అనలేదు. పైగా మరచిపోకుండా వచ్చినందుకు జాలితో చేరదీసి తన మనసును, తనువును స్వామికి అర్పించాడు. సహజంగా లోకంలో ఆత్మాభిమానం ఉన్న స్త్రీలు తమ భర్తలుగాని లేక ప్రియులుగాని పరస్త్రీలను కన్నెత్తి చూచినా సహించరు అలాంటిది పరస్త్రీ సంగమ గుర్తులతో ఇంటికి వస్తే ఇంట్లో పెనుతుఫాను చెలరేగుతుంది కొంతమంది స్త్రీలుమాత్రం తమ భర్తలు లేక ప్రియులు పరస్త్రీ వ్యామోహితులైనా తమను మరచిపోకుండా తమ చెంతకు వస్తున్నందుకు, తమపై ప్రేమ చూపుతున్నందుకు అంతే చాలని తృప్తిపడుతూ సహనం వహిస్తారు. ఈ కీర్తనలోని ప్రేయసికూడా తన ప్రియుడు ప్రేమతో కూడిన మగసిరి కలవాడని, వలపుమందు చల్లేవాడని, తాను ఎక్కడ తిరిగివచ్చినా, ఎంత రాత్రిఅయినా, పర స్త్రీ సంగమ గుర్తులు ఒంటిపై కనిపించినా, తనకు కోపం లేదని పైగా వాడిపోయిన ముఖం చూస్తూవుంటే నవ్వు వస్తుందే కానీ కోపం రాదని, తనను వదలి ఉండలేనని ప్రియునిపై తనకున్న ప్రేమానురాగాలను వ్యక్తం చేస్తోంది. ఇందులోని నాయకుడు దక్షిణనాయకుడైన శ్రీ వేంకటేశ్వరుడు ఇలా చేయడం అన్నిటా ప్రవీణుడైన ఆ జగత్పతికే చెల్లుతుంది గానీ సామాన్య మానవుడు చేస్తే సమస్యల వలయంలో చిక్కుకొనిపోతాడు. అన్నమయ్య వర్ణించిన దివ్యనాయిక జగన్మోహిని అయిన అలమేలుమంగ, ఆమె అందచందాలు లోకాతీతమైనవి. అనశ్వరమైనవి అన్నమయ్య సర్వశాస్త్ర పారంగతుడు. ఇతడు అలమేల్మంగ సౌందర్యాన్ని శిరస్సు మొదలు పాదం వరకు కనులార తిలకించాడు. అన్నమయ్యకు జ్యోతిషశాస్త్రంలో చెప్పబడిన పంద్రెండు రాశులు గుర్తుకు వచ్చాయి అవి ఆ దివ్యమోహనశృంగార రూపిణిలో దర్శనమిచ్చాయి. నాయిక విల్లువంటి కనుబొమలు ధనూరాశిగా, చేపలవంటి కన్నులను మీనరాశిగా, కుండలవంటి కుచములను కుంభరాశిగా, సింహపు నడుమువంటి సన్నని నడుమును సింహరాశిగా, మకరముద్ర కలిగిన పైట చెరగును మకరరాశిగా లేప్రాయపు వయసును కన్నెరాశిగా, బంగారుతో తులతూగు శరీరాన్ని తులారాశిగా, పదునైన గోళ్లను వృశ్చికరాశిగా, మదవతిగా ఒప్పుటచే వృషభరాశిగా, గొప్పపుమాటలచే కర్కాటక రాశిగా, లేతచిగురు మోవిని మేషరాశిగా తన ప్రియుడైన వేంకటేశ్వరునితో కలసినందుకు మిథున రాశిగా ఇలా వర్ణించాడు

ఇన్నిరాసుల యునికి యింతి చెలువపు రాశి
కన్నెనీరాశి కూటమిగలిగిన రాశి ॥

కలికిబొమవిండ్లుగల కాంతకును ధనురాశి
మెలుత మీనాక్షికిని మీనరాశి
కలువ కుచకుంభముల కొమ్మకును
కుంభరాశి
చెలగు హరిమధ్యకును సింహరాశి ॥

చిన్నిమకరాంకపు పయ్యెద చేడెకు
మకరరాశి
కన్నె పాయపుసతికి కన్నెరాశి
వన్నెమై పైడితులదూగు వనితకు
తులారాశి
తిన్నని వాడిగోళ్ళసతికి వృశ్చికరాశి ॥

ఆముకొను కొరపుల మెరయు సతికి
వృషభరాశి
గామిడిగట్టు మాటలసతి కర్కాటకరాశి
కోమలపుచిగురు మోవి కోమలికి మేషరాశి
ప్రేమ వేంకటపతిగలసె
ప్రియమిథునరాశి ॥

చంద్రవదన అయిన నాయిక ప్రియుని ఎడబాటు కలిగింది అప్పటి వరకు బాధేమీ లేదు కానీ ఇప్పుడు ఎలా వుందో అని చెలికత్తెలు దిగులుపడుతూ నాయిక విరహావస్థను నాయకునికి తెలియజేస్తున్నారు ప్రియుని ఎడబాటుగల్ల ప్రేమవల్ల సంతాపజ్వరం వచ్చింది అది ఎక్కువై శరీరం దహించుకొనిపోతోంది అప్పుడు శీతలోపచారాలు చేయవలసి వుంటుంది. ఇవి నాయికకు వాటంతట అవే సమకూరాయి నాయిక చంద్రకాంతశిలపై పడుకొని వుంది విరహజ్వరంతో ఉడికిపోతోంది అప్పుడు చంద్రునివంటి ఆమె ముఖకాంతులకు చంద్రకాంతశిల కరిగి ఆమెకు చల్లదనాన్ని చేకూర్చింది నాయిక విరహవేదనలో పొన్నచెట్టునీడలో, చిగురుటాకుపాన్పుపై పడుకొని ప్రియుని తిడుతూ పాట పాడుతోంది. అప్పుడు పొన్నపుష్పాలనుండి మకరందం స్రవించి ఆమెకు కొంత తాపోపశమనం కలిగించింది. విలాసంగా తూగు మంచంపై పడుకొని అరజారిన పైటతో హాయిగా పాడుతుండగా శ్రీ వేంకటేశ్వరుడు వచ్చి ప్రియురాలిని కలసి సంతోషాన్ని కలిగించాడు విరహ గీతాలలోకూడా చివరి చరణంలోమాత్రం నాయికానాయకులను ఐక్యంచేసి సుఖాంతం చేయడం అన్నమయ్య ప్రత్యేకత ఈ సందర్భంగా అన్నమయ్య-

ఇప్పుడెట్లున్నదో యిందువదన
అప్పటికి కొంత గుణమాయెనా వేళ ॥

తెలుపు శశికాంత వేదిక మీదమలగుపై
సొలగి పరితాపాగ్ని నుసుకగాను
వెలిదోలకు పాము వెన్నెలకు
శశికాంతంపు
టరగు కరగిన శైత్యమాయెనా వేళ ॥

చెలియ పొన్నలనీడ చిగురుపానుపుమీద
పలుమారు నిసుదూరి పాడగాను

చెలగి పొన్నలదిరియు చిలుకతేనెలపోవ
తెలివొంది కాంత వడదీరెనావేళ ॥
తొయ్యలి విలాసమునకూగు
మించను విరాడ
పయ్యెదరజార నిను పాడగాను
తియ్యమున కూడితివి తిరువేంకటేశ్వరుడ
నెయ్యంపు వేడుకలు నినిచెనావేళ ॥

అనే కీర్తన రచించాడు.

నాయిక శ్రీ వేంకటేశ్వరుని కలసి, అలసిపోయి, చెదరిన కేశాలతో భూషణాంబరాదులతో పూలపాన్పుపై ఒళ్ళు మరచి మత్తుగా పడుకొనివుంది. అప్పుడు చెలికత్తెలు నాయికను పరిహాసాలాడుతున్నారు. నాయిక, కస్తూరినామం పెట్టుకొనివున్న స్వామిసౌందర్యాన్ని చూచి ముగ్ధురాలై అతని లలాటాన్ని చుంబించింది. అప్పుడు ఆమె చిగురుటాకువంటి పెదవిపై అక్కడక్కడ కస్తూరి అంటుకొన్నది. అది ప్రేయసి ప్రియునకు వ్రాసిన ప్రేమలేఖవలె ఉందట. మనోహరి, చకోరాక్షి అయిన ఆమె కన్నుల తుదలు ఎఱ్ఱగా ఉన్నాయి అందుకు కారణం స్వామిపై నాటిన తన చూపుల బాణాలను వెనుకకు లాగుకొనగా చిమ్మిన రక్తమట. ఆమె చనుకట్టుపైనున్న మెఱుగులు పైటను అధిగమించాయి. అవి వేడుకతో ప్రియుడొత్తిన గోళ్ళముద్రలనే చంద్రరేఖలు వెదజల్లిన వేసవికాలపు వెన్నెలట. పద్మంవంటి ముఖం కలిగిన ఆమె చెక్కిళ్ళకు ఇరువైపులా ముత్యాల వరుసలు అమరివున్నాయి. అవి ప్రియుని సంగమంవల్ల కలిగిన చెమటబిందువులట. అన్నమయ్య సాళువ నరసింగరాయల కొలువులో రాజు కోరిక మేరకు ఈ శృంగార గీతిని ఆలపించాడు. ఆ రాజు ఇందులోని శృంగార భావసౌందర్యానికి పరవశించి కాళిదాసాది మహాకవుల కావ్యాలలోకూడా ఇంతటి అద్భుతవర్ణనలు కానరావని శ్లాఘించాడు. అన్నమయ్య పాడిన ఆ శృంగారపదం-

ఏమొకో చిగురుటధరమున యెడనెడ
కస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక
కాదుగదా ॥

కలికి చకోరాక్షికి కడకన్నులు కెంపై
తోచిన
చెలువంబిప్పుడిదేమో చింతింపరె చెలులు
నలువున ప్రాణేశ్వరుపై నాటిన
యాకొనచూపులు
నిలువున పెరుకగ నంటిన నెత్తురు
కాదుగదా ॥

పడతికి చనుగవ మెఱుగులు
పైపై పయ్యెద వెలుపల
కడుమించిన విధమేమో కనుగొనరే
చెలులు
ఉడుగని వేడుకతో ప్రియుడొత్తిన
నఖశశిరేఖలు
వెడలగ వేసవికాలపు వెన్నెలకాదుగదా॥

ముద్దియ చెక్కుల కెలకుల ముత్యపుజల్లుల
చేర్పుల
వొద్దిక లాగులివేమో వూహింపరె చెలులు
గద్దరి తిరువేంకటపతి కామిని వదనాంబు
జమున
అద్దినసురతపు చెమటల అందము
గాదుగదా ॥

దివ్యనాయకుడైన శ్రీ వేంకటేశ్వరుడు శృంగారపురుషుడు. ఆయన మూర్తిత్వం, వేషాలంకరణలు జగదేకసమ్మోహనములు. ఆ స్వామిని ఎంత చూచినా తృప్తితీరని అమృతస్వరూపం. నాయిక తన ప్రియుని రూపలావణ్యాలను తన చెలికత్తెకు చెప్పుకొని సంబరపడుతోంది. అతడు ఒంటి నిండా కమ్మని వాసనలు వెదజల్లే కస్తూరిని, ఎఱ్ఱటి కుంకుమను పూసుకొని వున్నాడు. అతని చెక్కులలోని నవ్వు చెవులలోని మకరకుండలాలతో కలసి కాంతులను వెదజల్లుతోంది. స్వామి గొప్పవైన ముత్యాల పతకాల హారాలతో ప్రకాశిస్తున్నాడు. బాహువులు శంఖచక్రాల కాంతులతో మించాయి. అంతటి శ్రీ వేంకటేశ్వరుడు వేంకటాచలంపై తనకు ఘనమైన కౌగిలి నిచ్చాడు. ఆ సందర్భంగా అన్నమయ్య-

అతడేపో చెలియా మాయాతడు
చేతనే వరముచూపి చెలువైన యాతడు ॥
కప్పులంగా కస్తురియు కుంకుమయు
మెయినిండ
నవ్వులించుకొనియున్న యాతడు
గొప్పగొప్ప ముత్తేల కుప్పెసవరము పెద్ద
కొప్పుతో చెలగీనదిగో, మాయాతడు ॥
మలయు చెక్కు లనవ్వు మకరకుండలముల
అలరిసిగ్గులె చల్లే యాతడు
బలువైన ముత్యాలపతకాల హారాల
వెలుగొందీనదె చూడవే మాయాతడు ॥

అనే సంకీర్తన రచించాడు అన్నమయ్య ఎంతటి భక్తాగ్రేసరుడో, అంతటి రసికాగ్రేసరుడుకూడా ఇతడు విధివశాన ఇద్దరాండ్రకు మగడయ్యాడు. అనురాగామృత జలధిలో ఓలలాడి వుండవచ్చు. అందుకే అలమేల్మంగా శ్రీనివాసుల ప్రణయాన్నికూడా హృదయాహ్లాదంగా వర్ణించాడు

శ్రీ వేంకటేశ్వరుడు అలమేల్మంగను కలసినందువల్ల నిలువెల్లా సొంపుగాఉన్నాడని, ఆమె కడగంటిచూపు స్వామి హృదయాన్ని తాకడంవల్ల వేంకటేశ్వరుడు శ్రీవత్సలాంఛనుడయ్యాడని, ప్రేయసి ఎడబాటువల్ల కందిపోయి నీలవర్ణుడయ్యాడని, ఆమె చక్రాలవంటి చనుగుబ్బలను చేతబట్టడంవల్ల చక్రపాణి అయ్యాడని, ఆమె కంఠంలోని కుంకుమపూత అతిశయించడంవల్ల పీతాంబరుడయ్యాడని, ఎప్పుడూ ప్రియురాలి కౌగి

లని ఆపేక్షించడంవల్ల నాలుగు చేతులు కలిగి వున్నాడని ఇలా అద్భుతంగా వర్ణించాడు.

నిన్ను గూడిన విభుని నిలువెల్ల సొంపాయ
విన్నయము నొనగూడె నింతలోపలనె ॥
సొంపు నీ కడగంటిచూపు హృదయము దాకి
అలనితడు శ్రీవత్సలాంఛనుండాయ
వెలది నిను రొమ్మ బాసి విరహంపు మెయికాక
వలన నీతడు నీలవర్ణుడైనాడు ॥
అదన నీ చనుగుబ్బలను చక్రముచేత
వదలకరవుచు చక్రపాణియైనాడు
సుదతి నీదేహమున సొబగు కుంకుమపూత
తెలిగి పీతాంబరం బీకనికినాయ ॥
ఆలింగనాపేక్ష నవయంబు నినుగూడ
తోలుడటుగాన నాలుగు చేతులాయ
శ్రీలలితమూర్తియగు శ్రీవేంకటేశ్వరుడు
పాలించె నిను నీకు పరితోషమాయె ॥

అన్నమయ్య శృంగారవర్ణనలు అపూర్వమైనవి ఆనందదాయకమైనవి శ్రేయోదాయకమైనవి. మానవులలో నానాటికి స్వచ్ఛమైన ప్రేమ, అనురాగం, భక్తి విశ్వాసాలు అడుగంటిపోయి ధనదురాశ, పరహింసాప్రవృత్తి పెరిగిపోతున్న ఈ రోజులలో అన్నమయ్య శృంగార సంకీర్తనలు ఆలోచనామృతాన్ని మనసుకెంతో హాయిని కలిగిస్తాయి. అన్నమయ్య శృంగార సంకీర్తనామృత సింధువులో ఈ విషయం ఒక్క బిందువుమాత్రమే.

* * *

పొన్నా లీలావతమ్మ
లెక్చరర్
తెలుగు విశ్వవిద్యాలయం
బొమ్మూరు-588 124,
తూ॥గో॥జిల్లా.

...... ..

# ఎఱ్ఱన కవిత్వము - జనజీవితము

— శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్

(గత సంచిక తరువాయి)

రాముడు లక్ష్మణుని 'తమ్ముడ' అని ఎంతో గారవంగా పిలిచాడు పైవేమారెడ్డి 'వాత్సల్యంబు' 'ఘనుండు' అంటూ ఎంతో ధీమాగా ప్రారంభించాడు. ఈ రెండింటిని జాగ్రత్తగా పరిశీలిస్తే ఎఱ్ఱయగారు 'రామాయణం' పేరిట వేమాయణం వ్రాశారని చెప్పవచ్చు ఇక్కడ నాయకుల పేర్లకే కాదు వారు జయించిన దుర్గాలకు కూడా చాలా చక్కని సమన్వయం కుదిరింది. రాముడు జయించిన లంక - వేముడు జయించిన మోటుపల్లి రెండు కూడా జలదుర్గాలే! ఎఱ్ఱయగారు రామాయణంలో మోటుపల్లి యుద్ధవిశేషాలను - విజయాలను ఎంతో ఆత్మీయంగా వివరంగా వర్ణించే ఉంటారు అంటే మనదురదృష్టం కొద్దీ అది మనకు దొరకలేదు.

తక్కిన రామాయణకర్తలకు అదొక పవిత్ర ఇతిహాసం. భక్తికి - ముక్తికి నెలవైన పారాయణ గ్రంథం. వారి వారి ఆధ్యాత్మిక ఆవేదనలకు - అనుభూతులకు నిలయం. అందుకే 'మళ్ళీ ఎందుకు రామాయణం' అని అడిగిన వారికి వారు 'మా భక్తి రచనలు మావికావ' అని నిర్మోహమాటంగా సమాధానం చెప్పారు.

కాని - ఎఱ్ఱయగారికి అది సజీవకావ్యం. ఆయన అధికార బధిరోన్మత్తులైన రావణులను చూచాడు క్రూరవీరకర్ములైన ఇంద్రజిత్తులను చూచాడు. యజ్ఞవిధ్వంసకులైన మారీచ సుబాహులను చూచాడు. వారిచేత పీడించబడి తాడించబడి అసహాయులైన ప్రజలు చేసిన ఆర్తనాదాలను విన్నాడు ఆ ఆపన్నులను రక్షించ దీక్ష వహించిన వీరుల కృషికి - సాహసానికి సాక్షీభూతుడుగా నిలిచాడు. అందుకే అతడికి రామాయణం ఒక ఇతిహాసం - ఒక కావ్యం మాత్రమే కాలేదు. నడుస్తున్న చరిత్ర రాముడు అతడి ఆరాధ్య దైవమే కాదు. అతడితో కలసి మెలసి తిరిగిన ధర్మవీరుడు. అందుకే ఆయన రచనలో ఆత్మసంవేదన అడుగడుగునా, పదపదాన గోచరిస్తున్నది

ఎఱ్ఱయగారు చిత్రించిన సమకాలీన సమాజాన్ని దర్శించడంలో బాగా ఉపయోగపడేది హరివంశం, రామాయణంలో చాలా చెప్పి ఉంటారు. కాని అది అలభ్యం. అరణ్యపర్వం సంపూర్ణ గ్రంథం కాదు. ఇంతేకాక దాని రచనాప్రణాళిక సంవిధానం సమస్తం నన్నయగారు నిర్దేశించినవి నృసింహపురాణ రచనా కాలం నాటికి దేశం సుభిక్షమైంది. శాంతి సుఖాలతో ఓలలాడుతున్నది. తాతగారు వ్రాయమంటే వ్రాసింది ఇక మిగిలింది హరివంశం అది ఆయన అనుభవాలకు - అనుభూతులకు - జీవితంలోని మిట్టపల్లాలకు దర్పణం అందులో ఆయన - రాజు - ఆయన ప్రజలు - ఆయన దేశం అతిస్పష్టంగా - అత్యంత విశదంగా కనపడుతున్నాయి.

అన్నయ వేముడు రాజ్యాభిషిక్తుడయ్యాడు. దేశంలో శాంతిభద్రతలు నెలకొన్నాయి. కురకల దౌర్జన్యాలు - ఆక్రమాలు అరికట్టబడ్డాయి. వారి తాకిడికి ఛిన్నాభిన్నమైన వ్యవస్థను తీర్చిదిద్ది

ప్రవర్తించాల్సిన గురుతరమైన బాధ్యతను స్వీకరించాడు వేమారెడ్డి. ఈ ప్రయత్నంలో ఆయన చేసిన ఘనకార్యాలను ఇలా వర్ణించారు ఎఱ్ఱయగారు.

అగ్రహారంబులు విద్యార్థపోష్యవృద్ధి
ప్రబల కిచ్చి యజ్ఞకర్తలుగ బనిచె
గోపురార తెరువులు గుళ్ళు ప్రతిష్ఠించి
లోక సంభావ్యములుగ నొనర్చె
నిధులు నల్లిండ్లును నిలిపె తోటలు సత్ర
ములు చలివందిళ్ళు వెలయబెట్టె
హేమాద్రి పరికీర్తితామిత ప్రతిదాన
నివహంబు లన్నియు నిర్వహించె' -
- హరివంశం - అవతారిక-19

ఇది వేమారెడ్డి చేసిన దానధర్మాలు. హేమాద్రి పండితుడు చేయమని చెప్పినవి కాబట్టి ఇవి చేయడంలో వేమారెడ్డి ప్రత్యేకత వేమారెడ్డి నాటి దేశకాల పరిస్థితులు తెలిస్తే తప్ప తెలియదు ఆ పరిస్థితులను ఎఱ్ఱయగారు ప్రత్యేకించి చెప్పలేదు. తన కథలో భాగంగా తన దుష్ట పాత్రలు చేసినట్లుగా చెప్పాడు

హరివంశం వేనుడి కథలో ప్రారంభమైంది అంతకు పూర్వం చెప్పబడిందంతా సృష్టిక్రమం - దేవతల కథలు, భూలోకానికి-మనుషులకు సంబంధించినంతవరకు వేనుడి కథయే మొదటిది, ఆ వేనుడు పరమ దుర్మార్గుడు. అతడి తల్లి మృత్యుపుత్రిక. ఆ అమ్మమ్మగారి క్రౌర్యమంతా అతడిలో మూర్తీభవించింది. అతడిపాలనలో ప్రజలు ఎన్నో అగచాట్లకు లోనయ్యారు ఆ అగచాట్లు ఎలాంటివో చాలా చక్కగావర్ణించారు ఎఱ్ఱయగారు. అవి - ఆ వర్ణనలు ఎఱ్ఱయగారి కల్పనలోంచి - కలలోంచి ఊడిపడ్డవి కాదు. సుమారుగా తన జీవితంలోని 30 సంవత్సరాల దీర్ఘకాలంలో చూచినవి- స్వయంగా అనుభవించినవి. తన నాటి దురగతల దౌర్జన్యాలను వేనుడివిగా చెప్పారాయన.

'జపములు గాయత్రి సహితంబుగా మాను
వేదంబు చేరును విడగ లేదు
సోమపానక్రియ చొప్పులు దూపర
హుతములు కరవయ్యె హుతవహునకు
సర్వదైవత సమర్చలు గట్టిపెట్టంగ
బడిన భూతంబుల పనులు సమసె
బరహితంబులు-దానపరతలు గడతేర
సతత వ్రతోపవాసములు పొలిసె

స్వామి చందంబు చందమా జనుల కనిన
మాట నిజముగ వేనుమాతలేకు-
డఖిల ధర్మపరాఙ్ముఖుడయిన వేని
మతము చెల్లించి రెంతయు మనుజకోటి!'
హరివంశం = అ 1 - ప. 103.

వేనుడికి వేదధర్మమంటే పరమ అసహ్యం-జపాలు-తపాలు-యజ్ఞాలు - యాగాలు తన రాజ్యంలో చేయకూడదనివని శాసించాడు. తన శాసనాన్ని అతిక్రమిస్తే 'చంపుదు-జెరతు నెవ్వానినైన' అని బెదిరించాడు. 'నేనే దేవుడిని నన్నే అందరూ పూజించాలని' ప్రకటించాడు.

'యజన మిజ్యంబు యష్టయానతికయిల్లు
నిన్ని తెరగుల వస్తువు లేన కాగ
దలపు దేమేని కర్జంబు గలిగ నేని
బన్నుగా నది చేయుడు నన్నుగూర్చి'
హ-అ 1-ప. 101.

- అని తిరుగులేని అధికారం చెలాయించాడు.

అంతులేని ఈ అధికారాన్ని సహించలేక ప్రజలుతిరుగబడ్డారు. వారికి మునులు ఋషులు నాయకత్వం వహించారు మొదట వేనుడికి నచ్చ చెప్పాలని ప్రయత్నించారు కాని వేనుడు 'పెల్చన నవ్వి', 'మీరేమియు నెరుంగ దూరక పొండ'ని అదరించాడు. సహజంగా శాంతమూర్తులైన ఆ మునులకు - ఋషులకు ఆగ్రహం కలిగింది. అందరూ కలిసి వేనుడిని వధించి కొత్తరాజును తెచ్చుకున్నారు. తన నాటి సమాజంలో దురగతల ఆగడాలను సహించలేక తిరుగబడ్డ బ్రాహ్మణ ప్రవరులనే ఈ కథలో మునులుగా చిత్రించాడు ఎఱ్ఱయగారు

ఇలాంటిదే మరో సన్నివేశం నరకుడి కథలో కలిసి వచ్చింది. వేనుడికన్నా రెండాకులు ఎక్కువ చదివాడు నరకుడు. వేనుడు బ్రాహ్మణ ధర్మాన్ని నిరసించాడే కాని స్త్రీల జోలికి పోయినట్లు లేదు. కాని నరకుడు స్త్రీల నవమానించడమే ప్రథమకర్తవ్యంగా పెట్టుకున్నాడు జాతి జీవితానికి స్త్రీ పట్టుగొమ్మ ఆ స్త్రీ చెడిపోతే జాతిగౌరవం నశిస్తుంది.

నరకుడు దేవతలందర్నీ జయించి దుర్మార్గం పట్టాడు. అతడికిబదరికావనంలో 'పుణ్యయజన తత్పరులై కూడియున్న తపస్వి పుంగవులు దెక్కేంద్రు' కన్పించారు. వారిదగ్గరకు వెళ్ళి నరకుడు-

"నన్ను గొలువుడు ముక్కడు నాక
నఖిలు
కాధ్వరంబులు మత్ప్రీతికై యొనర్పు
డేను గడుమేలు సేయుదు నిట్లయిన
నొండు తెరగుల పనులు మీరుడుగుడనిన'!

—వాళ్ళు ఒప్పుకోలేదు నరకుడు తన బంట్లను పిలిచి 'ఈ మూర్ఖులను శిక్షించ' మన్నాడు అప్పుడు వారు—

'యజ్ఞశాలలు వ్రచ్చి యగ్నికుండంబులు
పూడ్చి పశుశ్రేణి మాడ్చి విడచి
హోతల బ్రామి యుద్గాతల బోరిగొని
యుపదర్శకుల సదస్యులను మోది
యరుణులు గాల్చి గూపావలివిడిచిద
ర్భలు స్రుక్స్రువములను బాతివైచి
చరువులు భక్షించి సర్వాన్న రాసులు
వెదచల్లి సోమంబు పదట గలిపి

తాపస స్త్రీల జెఱచి తక్కన్యకా చ
యంబు చెఱపట్టి యజమానులైన వారి
బదలు ద్రోహంబుతో గట్టి చదియనడచి
యాప్రదేశము దారరై యసుర వరులు
కొంతతడవు విన్నుబవిచిం ద్రుళ్ళిరి!'

– హరివంశం ప్ర. భా ఆ 4. ప 49-57

ఎఱ్ఱనగారి కాలంలోని తురకలు కూడా మొదట తమ మతంలో చేరమని, తమధర్మాన్ని పాటించమని ప్రోత్సహించే వారు వారిమాట విని మతం మార్పిడి చేసుకొన్న వారికి ఉన్నతోద్యోగాలిచ్చి దండనాయకులనుచేసి సన్మానించే వారు కాదన్న వారిని రకరకాల చిత్రహింసలు పెట్టేవారు యజ్ఞశాలలు ధ్వంసం చేయడం-క్రతువులను విరుగడం-హోతలు మొదలైన వారిని చావబాదడం - యజమాని జుట్టుపీకడం - మొదలైనవి ఆ తురకలు చేసినవే! మానభంగాలు-అపహరణాలు వారి కంట్లో ప్రీతిపాత్రమైనవి. ఈ చారిత్రక సత్యాలను గమనించినప్పుడు వేరుడి కథలో-నరబలి కథలో ఎఱ్ఱనగారు చేసిన వర్ణనలు ఎంతస్వాభావికమైనవో ఊహించవచ్చు.

ఇక్కడ మరోవిశేషం గమనించవలసి ఉంది. పై రెండు సందర్భాలలో కూడా ఎఱ్ఱయగారు బ్రాహ్మణులు పొందిన కష్టాలనే అభివర్ణించారు. ఇందువల్ల ఆయనకు బ్రాహ్మణుల కష్టాలేకాని సామాన్య ప్రజల కష్టాలు కనిపించలేదని చాలా సులభంగా అభాండం వేయవచ్చు. అయితే కాస్త జాగ్రత్తగా ఆలోచించాలి.

(సశేషం)



# పోతన ప్రహ్లాద చరిత్ర - ఒక సమీక్ష

—డా॥ వందూరి వేంకటసత్యరామారావు

ఆంధ్రసాహిత్యమున కవిత్రయము వారి తరువాత మన్నన కెక్కిన కవి పోతనామాత్యుడు నన్నయ తిక్కనలు భారతరామాయణముల నాంధ్రీకరించి భాగవతాంధ్రీకరణమును వదలిపెట్టుట పోతనగారి పూర్వకృత సుకృతవిశేషము శ్రీమద్భాగవతాంధ్రీకరణమువలన జన్మరాహిత్యము లభించునని పోతన భావించినాడు.[1] ఆంధ్రుల అపూర్వ పుణ్యవిశేషముచేతనే ఉభయకావ్యకరణదక్షుడైన పోతన చేతిమీదుగ భాగవతాంధ్రీకరణ జరిగినది పోతన భాగవతము నొక కల్పతరువుతో నుపమించినాడు. లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామము, మంజులతాశోభితము, సువర్ణ సుమనస్సుజ్ఞేయము, సుందరోజ్జ్వల వృత్తము, మహాఫలము అయిన భాగవత కల్పవృక్షమును తెలుగువారికి అందించిన మహాభక్తుడు పోతనామాత్యుడు 'విద్యావతాం భాగవతేపరీక్షా' అని ప్రసిద్ధికెక్కిన భాగవతము పోతనచేతిలో రసాలముగా వన్నెకెక్కి పల్లవించి పుష్పించి ఫలించి తెలుగువారికి రసానందమును కలిగించినది.[2]

భగవద్భక్తితత్త్వ ప్రతిపాదకమును, భక్తిరససిద్ధాంతమున కాలంబనమైనది భాగవతము. కావుననే భాగవతము మోక్షశాస్త్రమైనది. వేదాంతశ్రవణము చేతకూడ పొందలేని భక్తిజ్ఞాన వైరాగ్యములు భాగవతశ్రవణముచేత లభించును. కావుననే-

నిగమములు వేయుఁ జదివిన
సుగమంబులుగావు ముక్తిసుభగత్వంబుల్
సుగమంబు భాగవతమను
నిగమంబుఁ బఠింప ముక్తినివసము బుధా!
(శ్రీభాగ-స్కం-ం-ప 189)

అని చెప్పబడినది

పంద్రెండు స్కంధములు, మూడువందల యిరువదిరెండధ్యాయములు పదునెనిమిదివేల గ్రంథములుగల సంస్కృత భాగవతము, పరిణతమనస్కుడు, నిరహంకారి, నిస్పృహుడునైన పోతన చేతిలో తెనుగున మిక్కిలిగా పెరిగినది ఇట్లు పోతనగారి చేతిలో పెరుగుటకు కారణములు- 1. అష్టాదశ పురాణములలోను భగవత్తత్త్వ రహస్యమును, భగవద్భక్తిని, భగవద్గుణ గణ విశిష్టతను విపులముగ వర్ణించిన పురాణముగుట 2. భాగవతాంధ్రీకరణమున మూలగ్రంథము నేకాక వ్యాఖ్యానములనుకూడ పరిశీలించి అందలి విషయములను చొప్పించుట. 3 భగవద్గుణగణములను, భగవద్దివ్యమంగళ స్వరూపమును వర్ణించు పట్టులను, భక్తిని ప్రపంచించు భాగములను పోతన నిరుపమాన నిరతిశయ భక్త్యావేశమున విశేషముగ గద్య పద్యములను రచించుట. 4. సంస్కృత భాగవతమున ప్రతిపాదింపబడిన కృష్ణ కథలను గ్రహించి తెలుగువసమాకూర్చుట అయియుండవచ్చునని శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు అభిప్రాయపడిరి.[3]

1. శ్రీమహాభాగవతము- స్కంధము-1 పద్యము 19.
2. అదే-స్కం 1-ప 20.
3. పోతన-పుట 64 - శ్రీ నిడుదవోలు వెంకటరావు.

మహాభక్తుడైన పోతన గజేంద్ర మోక్షము, వామన చరిత్ర, ప్రహ్లాద చరిత్ర, రుక్మిణీకళ్యాణము, నరకాసుర వధ, గోపికా గీతలు, కుచేలోపాఖ్యానములలో పులకించి తన్మయత్వముతో మూలమును పెంచి ఆ యా ఘట్టములను సర్వాంగసుందరముగా తీర్చిదిద్దెను కావుననే అవి ఆంధ్రుల హృదయకుహరాలలో శాశ్వతముగా నిలబడిపోయినవి.

శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవనము, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము అని భక్తి తొమ్మిదివిధములుగా చెప్పబడినది.[4] కృష్ణుని కథలు, విష్ణుభక్తుల కథలు, విష్ణువు దివ్యావతారవిశేషములు శ్రవణ భక్తి ప్రాధాన్యమును స్పష్టము చేయును. భగవంతుని గుణలీలాదులను వర్ణించుట కీర్తనభక్తి. కురుక్షేత్రయుద్ధము పూర్తి అయిన పిమ్మట కుంతీదేవి శ్రీకృష్ణుని కీర్తించుట (స్కం 1-ప 185-200), భీష్ముడు శ్రీకృష్ణుని స్మరించుట మొదలైనవాని కీర్తనభక్తి కుదాహరణము. భగవంతుని మఱువకుండగ ఎల్లప్పుడు ధ్యానించుట స్మరణభక్తి. ఇందుల కుదాహరణముగా ద్వితీయ స్కంధములోని ఖట్వాంగుని వృత్తాంతమును పేర్కొనవచ్చును. భగవంతుని భక్తుల, గురువుల, సాధువుల పాదాలను సేవించినచో పాదసేవన భక్తి అనబడును. మధురానగరములో మాలాకారుడైన సుదాముని చరిత్రము ఇందుల కుదాహరణము. పుష్పములు, తులసి మున్నగు పూజాద్రవ్యములతో భగవంతుని పూజించుట అర్చనభక్తి కంసు పరిచారిక యగు కుబ్జ నింగుల కుదాహరింపవచ్చును. భక్తిశ్రద్ధలతో భగవంతునకు నమస్కరించుట వందనభక్తి. ఇందులకు అక్రూరుడు ఉదాహరణము. భగవంతునకు తాను దాసుడనని భావించు సర్వకర్మలను అంకితము కావించినచో దాస్యభక్తి యగును. గుణగరిష్ఠుడైన అంబరీషుడిందు కొక నిదర్శనము. భగవంతుని మిత్రునిగా భావించి, ఆయన గుణగణములను అలవర్చుకొనుట సఖ్యభక్తి అందురు. ఈ సఖ్యభక్తి కుదాహరణము అర్జునుడు, కుచేలుడు. త్రికరణశుద్ధిగా భగవంతునకు శరణాగతి చేయుటనే ఆత్మనివేదనభక్తి అందురు. ఈ భక్తినే ప్రపత్తి, న్యాసము, ఆత్మనిక్షేపము అని కూడ వ్యవహరించెదరు

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం
శరణం వ్రజ
అహంత్వాం సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః"

అను గీతావాక్యము పైవిషయములనే తెలుపుచున్నది. ఈ ఆత్మనివేదన భక్తికి తార్కాణము గజేంద్రుని కథ. నవవిధ భక్తితత్వమును గూర్చిన భాగవత శ్లోకము పోతన చేతిలో-

"తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్
దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో
నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిది భక్తిమార్గముల
సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు
దలంతున్ సత్యంబు దైత్యోత్తమా![4]

అను రూపము నందినది.

ప్రహ్లాదుడు హిరణ్యకశిపు నలుగురు కుమారులలో నొకడు. అతడు నిర్మలాత్ముడు, సద్గుణములప్రోవు, వాసుదేవునియందు సహజ సంబద్ధమైన నిరంతర ధ్యానరతుడు, కర్మబంధములవిముక్తుడు, బుధజనవిధేయుడు, పరమ భాగవతశ్రేష్ఠుడు కావుననే సత్కవీంద్రులు ప్రహ్లాదుని ప్రశంసాగీతముల నాలపించెదరు. గురువులగు చండామార్కులు ప్రహ్లాదునిచేత శాస్త్రముల నన్నింటిని చదివించిరి. వైష్ణవభక్తిపూర్ణుడైన ప్రహ్లాదుడు వాని నాలించి పఠించెను. హిరణ్యకశిపుడు కుమారుని చదువు ఎట్లు సాగుచున్నది తెలిసికొనగోరి ప్రహ్లాదుని తన దగ్గరకు పిలిపించుకొని "ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమై యుద్యోగసంరూఢము, విశ్వంభరన్నేడ వైరికి? చదివితే వేదంబులన్ శాస్త్రముల్" అని ప్రశ్నించినాడు. దీనికి ప్రహ్లాదుడు విష్ణుప్రశంస కావింపగా, హిరణ్యకశిపుడు నవ్వి ఓరి వారు ఎవ్వరేమి చెప్పిన నట్లు పలికెదరు. విష్ణుభక్తులగు బ్రాహ్మణులు ఈవిధముగా నేర్పిరేమో పరిశీలించవలసినదిగా చండామార్కులను కోరెను. స్వపక్షవినాశకర మగు విష్ణుతత్వమెట్లలవడినది వారు ప్రహ్లాదుని ప్రశ్నించిరి. అందులకు ప్రహ్లాదుడు

"ఇనుము అయస్కాంతసన్నిధి నెట్లు భ్రాంత
మగు వ్యాప్తి కేశవు సన్నిధి నావిధమున
గరగుచున్నది దైవయోగమున జేసి
బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంత
మగుచు"[6]

అని ప్రత్యుత్తర మొసగినాడు. గురువులగు చండామార్కులు విష్ణుపరమైన ఆలోచనలు కట్టిపెట్టవలసినదిగా బోధించిరి. బెదరించిరి శిక్షించిరి. ధర్మార్థకామముల గూర్చి మరల బోధించిరి. విద్యాభ్యాసము పూర్తి అయినంది గురువులు ప్రహ్లాదుని

---

8 శ్రవణం కీర్తనం విష్ణోం స్మరణం
పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ
నివేదనమ్-సంస్కృత భాగవతము

4. శ్రీమహాభాగవతము-సప్తమ
స్కంధము-పద్యము 167.

5. శ్రీమహాభాగవతము- సప్తమ స్కంధము-పద్యము 189.

6. డిటో పద్యము 149.

హిరణ్యకశిపునియొద్దకు తీసికొనిపోయిరి. గురువులు బోధించిన విషయములలో శ్రేష్ఠమైనట్టిదానిని చెప్పవలసినదిగా ప్రహ్లాదుని హిరణ్యకశిపు డడిగెను అందులకు ప్రహ్లాదుడు సర్వాత్మున్ హరిన్నమ్మి సజ్జనుడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!" అని సమాధాన మొసగినాడు ఈ మాటలు వినినంతనే గురుపుత్రులపైన హిరణ్యకశిపున కనలేని కోపము కలిగెను గురుపుత్రులు వెంటనే అది ప్రహ్లాదుని నైజము కాని మా దోషము కాదనిరి గురువులు నేర్పని విషయములు నీమతి కెట్లలవడినవని కుమారుని ప్రశ్నించెను భగవంతుడు విష్ణుని అనుగ్రహమునన ప్రహ్లాదుని సమాధానము. ప్రహ్లాదుని మాటలకు విపరీత ఆగ్రహమును పొంది, ప్రహ్లాదుని శిక్షింపవలసినదిగా ఆజ్ఞాపించినాడు. రాజాజ్ఞననుసరించి విషప్రయోగాదులనేకముల ప్రహ్లాదుని తీవ్రశిక్షలకు గురిచేసిరి అవి ఏమియూ ప్రహ్లాదుని బాధింపలేకపోయినవి. అవియన్నియూ "పాపకర్మునియందుఁ బ్రయుక్తంబులైన సత్కార్యంబులుంబోలె విఫలంబులై"[7] నవి ఈ కుమారునివలన తనకు మృత్యువు సిద్ధించునని హిరణ్యకశిపుడు భావించెను ప్రహ్లాదుడు పిన్నవయస్కుడు, వృద్ధగురుజన సేవచే జ్ఞానవంతుడగును, కావున ప్రహ్లాదుని కోపగించుకొనవలదని పలికి చండామార్కులు ప్రహ్లాదుని తమతో తీసికొనిపోయి త్రివర్గంబుల నుపదేశించిరి. అది నచ్చని ప్రహ్లాదుడు రాక్షసకుమారులను చేరదీసి వారికి విష్ణుభక్తిని బోధింపసాగెను. ప్రహ్లాదుని మాటలకు వెరగుపడిన రాక్షసకుమారునికి ఆలోచనము లెట్లు కలిగినవని వారు ప్రశ్నించిరి నారదుడు తనకు ధర్మతత్త్వమును, నిర్మలజ్ఞానము నుపదేశించెనని, ఆ తపసి మతిముచే మీకు బోధించితినని ప్రహ్లాదుడు సమాధానమిచ్చెను.

గురుపుత్రులగు చండామార్కు లావిషయమునే హిరణ్యకశిపునకు చెప్పిరి వారి మాటలను విన్న హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని 'ఎవ్వని బలమున నాడెదవు నాకుఁ బ్రతికూలుఁడవై'[8] అని ప్రశ్నించినాడు. అందులకు ప్రహ్లాదుడు—

బలయుతులకు దుర్బలులకు
బల మెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బల మెవ్వఁడు ప్రాణులకును
బల మెవ్వం డట్టివిభుఁడు బలము
సురేంద్రా"[9]

అని ప్రత్యుత్తరమిచ్చినాడు అయినచో నట్టివా డెక్కడగలడో చూపగలవా యని హిరణ్యకశిపు డడిగెను. అందులకు ప్రహ్లాదుడు—

"ఇందుఁగలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన నం
దందే గలఁడు దానవాగ్రణి! వింటే"[10]

అని సమాధానమిచ్చినాడు. హిరణ్యకశిపుడు స్తంభమునందు చక్రిని చూపుమనుచు స్తంభమును బ్రద్దలు కొట్టగానంగు శ్రీ నరసింహదేవుఁ డావిర్భవించెను అతడు నరమూర్తి కాదు అట్లని హరిమూర్తియూ కాదు హరి మాయచేత కల్పింపబడిన మానవాకారము కేసరి ఆకారముగల మూర్తి అట్టి మూర్తిని హిరణ్యకశిపు డెదిరించి మరణము నందెను. హిరణ్యకశిపు సంహారమునకు సంతసించిన నిర్జరాంగనలు పుష్పములు వర్షించిరి. బ్రహ్మాదిదేవతలు స్తుతించిరి. కాని శ్రీ నృసింహమూర్తి శాంతమూర్తి కాలేదు. శ్రీలక్ష్మీదేవికూడ శ్రీనృసింహుని ప్రసన్నం చినది. ఫలితము లేకపోయినది. చివరకు ప్రహ్లాదుడు ప్రార్థించెను. నిష్కాముడైన యేకాంతభక్తుడగు ప్రహ్లాదుని ప్రార్థనముతో శాంతమునంది మన్వంతరసము

మెల్ల రాక్షసప్రభువగునట్లు, చివరకు తన్ను నమిపించునట్లు అనుగ్రహించెను.

ప్రహ్లాదుని కథను పరిశీలించినచో నందు భాగవతలక్షణము నా సురలక్షణమునకు జరిగిన సంఘర్షణము స్పష్టమగును. ఈ కథయందు ప్రహ్లాదుడు శుభకర్మవాసనకు ఆశ్రయముకాగ హిరణ్యకశిపుడు అశుభకర్మవాసన కాశ్రయమయ్యెను హిరణ్యకశిపుడు వైకుంఠవాసి. హరి పార్శ్వచరుడు కాని ఋషిశాపముచే రాక్షసుడుగా జన్మించెను ఈతడు అనంతమైన తత్త్వజ్ఞానము కలవాడు హిరణ్యాక్షుని మృతికై విచారించుచున్న తల్లికి, హిరణ్యాక్షుని భార్యకు కావించిన తత్త్వబోధనవలన వానికి సృష్టిరహస్యమంతయు తెలియునని బోధపడును. కాని వాని రాక్షసస్వభావమువలన విష్ణుద్వేషముకూడ అధికముగా కలదు అందువలననే గో, భూసుర, వర్ణాశ్రమధర్మములను, వేదములను నాశనము చేయవలసినదిగా తన వారిని ఆజ్ఞాపించినాడు ఈ తీవ్రమైన విష్ణుద్వేషమే వానికి ముక్తిహేతువైనది ఇక ప్రహ్లాదుడు అసురగర్భస్థుడైనప్పటికి నారదుని అనుగ్రహమువలన పరమభాగవతుడుగ జన్మించెను. కావుననే ఆయన సాధన భక్తిమార్గమున పడి భక్తాగ్రగణ్యుడైనాడు కావున భక్తిపాలనమునకై అవతరించినదే శ్రీనృసింహావతారము ఏ మార్గముతోనైన భగవంతుని చేరవచ్చునని యీ కథ నిరూపించుచున్నది హిరణ్యకశిపుని విష్ణుద్వేషము, ప్రహ్లాదుని విష్ణుభక్తి సంఘర్ష

7 డిటో పద్యము 19౨.

8. శ్రీమహాభాగవతము-సప్తమ స్కంధము-పద్యము 262

9 డిటో పద్యము 264.

10. డిటో పద్యము 275.

(తరువాయి 27వ పేజీలో)

# వేదుల సూర్యుని జ్ఞానమహస్సు

— డా. టి. బాలసుబ్బయ్య

(గత సంచిక తరువాయి)

'కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన' అని భగవానుడు గీతలో ఈవిషయాన్నే చెప్పాడు. దీన్నే అవరోహణా క్రమం అంటారు. ఈవిధంగా ఆరోహణ అవరోహణ విధానంతో పరమాత్మ తత్త్వాన్ని అవగాహన చేసికొని అంత్యకాలంలో తద్గత చిత్తుడైనవాడు శాశ్వత పునరావృత్తిరహితమైన పరమాత్మ కైవల్యాన్ని పొందుతాడు 'యాంయాం తేమతి స్సాగతిః' అని గీతావాక్యం. దీన్నే పూర్ణయోగం అంటారు. అయితే ఇది సులభ సాధ్యం కాదు అతిగహనమైంది దీన్ని సాధించడానికి మానవున్ని అఖండమైన ప్రయత్నం అవసరం. ఈమార్గం అనేక జన్మలసాధనల సంస్కార విశేషంచేత మాత్రమే సుగమమౌతుంది. 'మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే। యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః॥' అన్న భగవద్గీతా వాక్యాలు ఈ విషయాన్నే ధృవపరస్తున్నాయి. ఈ సంస్కార విశేషమే ఏదో ఒకనాటికైనా మానవుని (జీవుని) కి పరబ్రహ్మకైవల్యాన్ని సిద్ధింపజేస్తుంది. 'బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే' అని భగవానుని వాక్కు. ఈ ముక్తిని సాధించడానికే జీవుడు తపనచెందాలి. ఈవిషయాన్ని, దీనిసాధనకై అవలంభించవలసిన మార్గాన్ని చెప్పేదే భారతీయ వేదాంతం దీన్నే వేదాలు, ఉపనిషత్తులు, భారత రామాయణాదిసద్గ్రంథాలు కంఠోక్తిగా ఘోషిస్తున్నాయి. వీటన్నిటిలో బాహ్యాంగాలోక వృత్తాన్ని తెలుపడానికై సామాన్యమైన కథారూపమైన బాహ్యార్థంఉన్నా అంతర్గతంగా పరమాత్మ తత్త్వాన్ని ప్రబోధించే విషయమే అనుస్యూతంగా ఉంది. భారతాది గ్రంథాలలో నిక్షిప్తమైన ఈ విషయాన్నే శ్రీ వేదుల సూర్యనారాయణ శర్మగారు తమ ఉపజ్ఞకారణంగా సుస్పష్టం గావించారు. వీరి విషయ విశ్లేషణ, సంయమనధోరణి చూస్తే ప్రాక్తన ఋషిపుంగవుని ఆత్మయో ఈయనను ఆవేశించి వీరిచే ఈ మహాకార్యాన్ని చేయించింది అనిపిస్తుంది.

రామాయణ, భారత, భాగవత, దేవీభాగవత విష్ణుపురాణాల (ఈ రెండూ ఒకే గ్రంథం)లోని అంతరార్థాలను ఆమూలచూడంగా జీవబ్రహ్మైక్యద్యోతకాద్వైత సిద్ధాంత పరంగా వ్యాఖ్యానిస్తూ శ్రీవేదుల సూర్యనారాయణ శర్మగారు అంతరార్థగ్రంథ చతుష్టయాన్ని రచించారు వీనిలో రామాయణ, భారతాలు ఆద్యంతమూ ఏకకథారూపంగాఉండేవి. వీనియందు అవాంతరంగా వచ్చిన ఉపాఖ్యానాలు కూడా మూలకథతో ప్రత్యక్షంగానో పరోక్షంగానో సంబంధం ఉండేవే అందువల్ల వీనికిసంబంధించిన అంతరార్థ వివరణ ఆధ్యాత్మిక సాధనామార్గాన్ని క్రమవికాసంతో సంపూర్ణంగా తెలుపుతుంది ఆధ్యాత్మిక చింతనాపరుడై సాధన చతుష్టయ సంపన్నుడైన సాధకుడు తనసాధనామార్గంలో వివిధదశలను అధిగమించి, జీవన్ముక్త స్థితికి చేరి, దేహత్యాగానంతరం సన్మాత్రాఖండరూప బ్రహ్మభావంతో కైవల్యాన్ని పొంది, మరల జననమరణరూప సంసారమున బడక శాశ్వత విముక్తిని సాధించే వరకు ఉన్న పూర్ణయోగ విధానాన్ని అఖండంగా రామాయణ, భారతాలు తెలుపుతాయి. ఇక భాగవత, దేవీభాగవత-విష్ణుపురాణాలు వివిధ కథా సంకలనాలు అందువల్ల ఇందలి కథలకు వేరువేరుగా అంతరార్థాలు చెప్పుకోవలసిందే. ఇవి సాధకుడు తనసాధనా మార్గంలో తాను ఏస్థాయిలో ఉండేదీ, అందులో వానికి కల్గే వివిధప్రలోభాలూ సాధనాభ్రష్టతలూ, గ్రహించవలసిన మెలకువలూ మొదలైన వాటిని తెలిపి అతని సాధనను సుగమం చేసేవిగా ఉన్నాయి.

ఇప్పుడు ఆగ్రంథాలలో నుండి ఒకటి రెండు అంశాలను మచ్చుగా గ్రహించి, వానిలో శ్రీ శర్మగారు ఆయా అంతరార్థాలను ప్రకటించటంలోని ప్రయోజనాన్ని చూతాము రామాయణం.

రామాయణం అన్నదానిలో 'రామ' అనగా 'రమంతే యోగినః అస్మిన్ ఇతి రామః' అని వ్యుత్పత్తి యోగులు దేనియందు ఆనందిస్తుంటారో అది రామపదానికి అర్థం జ్ఞానమునందే యోగులు ఆనందభావం పొందుతారు. కనుక రామ అన్న పదానికి 'జ్ఞానం అని అర్థం. ఆయనం

---

(26వ పేజీ తరువాయి)

ణము చెందగా శ్రీనరసింహావతారము జరిగెను. పోతన ఈ సంపూర్ణ ఘటనను ప్రతిభావంతముగా చిత్రించెను. ఇది పోతన కథాకథన శిల్పమునకు నికషో ఫలము

* * *

డా॥ వందూరి వేంకటసత్యరామారావు
48-13-28, గాంధీపురం-I
రాజమండ్రి.

0 ..0

అవకాశస్థానం (అయనం నిలయే మార్గే-నానార్థరత్నమాల). రామాయణం అంటే జ్ఞానానికి నిలయం-స్థానం అని అర్థం అందుకే శ్రీ శర్మగారు రామాయణాన్ని జ్ఞానపీఠం అన్నారు. వీరు రామాయణంలోని ఆరుకాండలను (ఉత్తరకాండం మినహా) రెండు రెండును ఒక భాగంగా ఆధ్యాత్మిక పరంగా విభజించారు. బాల-అయోధ్యా కాండలను ఇంద్రియ నిగ్రహీకరణ సాధనగా, అరణ్య-కిష్కింధాకాండలను ఇంద్రియ ప్రశాంతీకరణ సాధనగా సుందర-యుద్ధకాండలను ఇంద్రియ విలీనీకరణసాధనగా జ్ఞానపీఠాన్ని (రామాయణాన్ని) విభజించారు

రామాయణ కథలో దశరథుడు అయోధ్యను పాలిస్తుండటంతో ప్రారంభించారు శర్మగారు. ఆసమయంలో దేవతలు రావణాది రాక్షసుల బాధ భరించలేక తమ్ము కాపాడమని విష్ణువును వేడుకోగా, ఆయన తాను దశరథునికి పుత్రుడుగా జన్మించి వారికోర్కె తీరుస్తానంటాడు. అయితే ఈదశరథుడు, అయోధ్య, దేవతలు, రావణాది రాక్షసులు, విష్ణువు, రాముడు ఎక్కడో లేరు. మానవుని శరీరంలోనే ఉన్నారు శారీరక మీమాంస ప్రకారం మానవదేహంలోని భిన్నవృత్తులే ఇవన్నీ, మానవుడెప్పుడూ సౌఖ్యకాంక్షి, ఈ పుట్టుక, జీవనం, అవసానం సుఖంగా గడిచిపోవాలన్నదే అతని నైసర్గికమైన ఆకాంక్ష. 'అనాయాసేనమరణం, వినాదైన్యేన జీవనం' అన్నవి ప్రధానమైన మానవజీవితలక్ష్యాలు. అందుకని మానవునిలోని దైవీసంపదకు సంబంధించిన సాత్త్వికవృత్తులు అంటే దేవతలు, తమలోని ఆసురసంపదకు సంబంధించిన తామసిక మనోవృత్తులు అంటే రావణాది రాక్షసులు పెట్టే బాధలు భరించలేక తమ్ము తరింపజేయమని తమలో ఉన్న సర్వవ్యాపకుడైన భగవంతుని (విష్ణువును) ధ్యానించడమే దేవతలు విష్ణువుకు రాక్షససంహారం చేయమని కోరడమంటే అప్పుడు విష్ణువు దశరథునికి పుత్రుడుగా జన్మించి వారి కోర్కె తీరుస్తానంటాడు దశరథుడు అంటేపదిఇంద్రియాలనే (5 కర్మేంద్రియాలు, 5 జ్ఞానేంద్రియాలు) గుర్రాలను పూన్చిన మనస్సనే రథాన్ని సరియైన త్రోవలో నడిపించే జీవుడనేసాధకుడు అని అర్థం అతడు అయోధ్యను పాలిస్తున్నాడు అయోధ్య అంటే-జయించడానికి శక్యంకానిది జన్మ అని అర్థం జీవునికి ఈ జననమరణ పరిభ్రమణ చక్రంనుండి బైటపడటం అనేది సులువుగా సాధ్యమయ్యేది కాదు కాని దీనికే (అయోధ్యకే) శరీరం అని అర్థం. అంటే దశేంద్రియాలను నిగ్రహిస్తూ జీవుడుశరీరంతో ఉండటమే దశరథుడు అయోధ్యను పాలించడం అంటే.

అయితే మానవుడు జన్మ, జరాది సంసార దుఃఖాలనుండి శాశ్వత నివృత్తిపొందాలంటే దానికై అతడు శ్రమించాల్సి ఉంటుంది దీన్నే సాధన అంటారు. ఈ సాధనామార్గంలో మొదట మానవుడు (జీవుడు) సాధన చతుష్టయసంపన్నమైన అధికారాన్ని సంపాదించి తర్వాత ఉత్తరకార్యక్రమాన్ని నిర్వహించాలి నిత్యానిత్యవస్తువివేకం, ఇహాపరలోక భోగవైముఖ్యం, శమాదిషట్కసంపత్తులతో కూడియుండి మోక్షేచ్ఛ కలిగిన జీవుడే దశరథుడు. ఈయన పుత్రకామేష్టి, అంటే పుల్+త్ర+కామ+ఇష్టి అనగా నరకంనుండితన్నురక్షించుకోవాలనే కోరికతో చేసే తపస్సును చేశాడు. దీనివల్ల ఆయనకు తనలోని అగ్ని అంటే అద్వయం కాలూ కాకేయైన పరమాత్మ పాయసాన్ని అంటే భగవత్సంబంధమైన మహాశక్తినిఇచ్చాడు దీనిలోని సగంభాగాన్ని దశరథుడు కౌసల్యకు ఇవ్వగా అంటే సాధకుడు తనలోని సత్త్వగుణంలో లీనం చేయగా అద్వైతశక్తి రాముడుగా అంటే ఆనందంతూత జ్ఞానంగా అవతరించింది ఇక్కడనుండి దశరథ పదంతో చెప్పబడిన సాధకుడు రాముడుగా మారతాడు. ఇకదే విశ్వామిత్రుడనే మోక్షవిద్యోపదేశ గురువును పొంది విజ్ఞానాన్ని పెంపొందించుకొని, వివిధసాధనలనుఆచరించి చివరగా దశకంఠ రావణుని సంహరించడంతో అనగా దశేంద్రియాల ఉద్రేకం పొందే తామసలక్షణాన్ని తనలోని అఖండానందరూప పరమాత్మలోలీనం చేయడంతో రామాయణం ముగుస్తుంది-జీవునికి జీవన్ముక్తస్థితి అంటే ముక్తిని పొందికూడా జీవించడం అన్నది సిద్ధిస్తుంది. జీవన్ముక్తస్థితిలభించినా కూడా సాధకుడు దేహత్యాగం చేసిన తర్వాతనే కైవల్యాన్ని పొందుతాడు జీవన్ముక్తుడుకర్మలు చేసినా ఫలాకాంక్షలేని వైరాగ్యంతో వాటిని చేయడంవల్ల ఈ కర్మలవాసనలు జీవుని అంటవు, వేయించిన విత్తనంమొలకెత్తని విధంగా రావణవధ తర్వాత రాముని అయోధ్యాపాలనను చెప్పేఉత్తరకాండ కథకు ప్రాణోత్క్రమణపర్యంతం జీవన్ముక్తుడు వాసనారహితుడై జీవించి, దేహత్యాగంతో వ్యష్టిప్రకృతిని సమష్టిప్రకృతిలో (విశ్వచైతన్యంలో లీనంచేసి కైవల్యాన్ని పొందడమని అర్థం

(సశేషం)







# నిత్యవ్యవహారంలో పద్యం

—శ్రీ పోలేపెద్ది రాధాకృష్ణమూర్తి. ఎం ఏ, ఎం ఫిల్.

మనం నిత్యమూ అనేక సంఘటనలను చూస్తుంటాం అనేక వస్తువులను చూస్తుంటాం! శబ్దాలను వింటుంటాం! కాని, ప్రతిదాన్ని గురించి అంత శ్రద్ధగా పట్టించుకోం! ఐతే, మనకు సంబంధించిన, లేదా మనకు ఆసక్తివున్న వస్తువులను చూచినప్పుడు, మాటలను విన్నప్పుడు వాటిని గురించి తరచి తరచి ఆలోచిస్తుంటాం! ఇది మనకు అనుభవంలో వున్న విషయం

మా ఇంట్లో ఒక కాలింగ్ బెల్ ఉంది. దాని స్విచ్‌ని నొక్కితే, 'డింగ్ డాంగ్' అని శబ్దం వస్తుంది. ఒకసారి మా యింటికి శ్రీ ఇలపావులూరి కామేశ్వరరావుగారు_ గొప్ప సంగీతవిద్వాంసులు వచ్చారు ఆ శబ్దాన్ని వింటూనే వారు, "మీ కాలింగ్ బెల్ మోహనరాగంలో పలుకుతున్నదండీ" అన్నారు అంతవరకు మా కెవ్వరికీ ఆ సంగతి తెలియదు

ఒక వడ్రంగి ఎవరి ఇంటికన్నా వెళ్ళినప్పుడు ఆ ఇంటి దర్వాజాలు, మొదలైనవి ఏ చెక్కతో చేశారు? ఏడిజైన్‌లో చేశారా? అని చూస్తాడు అదే ఒక ఫోటోగ్రాఫరైతే, అతని దృష్టి ఆ ఫోటోలమీదికి వెళుతుంది. అంటే, ఏ విద్యకు సంబంధించినవారు ఆ వస్తువులను ఆ దృష్టితోనే పరిశీలిస్తారని తాత్పర్యం ప్రస్తుతం మనం పరామర్శించబోయే విషయం పద్యం_ఛందస్సు.

* * *

ఛందశ్శాస్త్రాన్ని చక్కగా చదువుకొన్నవాడు, ఆశాస్త్రంపట్ల గౌరవమూ, ఆపేక్ష వున్నవాడు ఏ పదాన్ని విన్నా అది ఏ గణం? ఇది ఏ పద్యం? అనే ఆలోచిస్తాడు ఎక్కడనుండన్నా గ్రామఫోనులో "అదిగో ద్వారక " అనే పద్యం వినిపించిందనుకోండి, ముందుగా అతనికి_ అప్రయత్నంగానే_ వచ్చే ఆలోచన 'ఇది మత్తేభం' అని. ఛాందసునికి గుమ్మడి అనే మాట వింటే ఇది భగణం అనిపిస్తుంది రేలంగి అనే పేరులో అతనికి తగణం కనిపిస్తుంది వాణిశ్రీలో మగణం కనిపిస్తుంది ఇట్లాగే తినేపదార్థాలు, వాడుకొనే వస్తువులు_ ఏ పదాలైనా, అతనికి గణరూపంలోనే దర్శనమిస్తాయి. ఆ పేర్లు ఇమిడేట్లుగా మనస్సులోనే ఆశువుగా ఒక పాదమో. అరపాదమో పద్యం గిలుకుతాడుకూడా? "సర్వం విష్ణుమయం జగత్" అన్నట్లుగా, అతనికి సర్వమూ ఛందోమయమే!

ఒక మందులషాపు ముందున్న బోర్డు మీద ఈవిధంగా వ్రాసివున్నది. "అన్ని మందులు ఇచ్చట అమ్మబడును"_ఆ బోర్డు వ్రాసిన పెయింటర్‌కీ, వ్రాయించిన షాపు యజమానికీ, తెలియకపోవచ్చునుగాని, ఇది తేటగీతి పద్యపాదం. యతి గణ ప్రాసలు సలక్షణంగా సరిపోయినై.

ఆర్టీసీ బస్ స్టాండ్‌లో ఒకాయన మరొకాయనకు చెబుతున్నాడు "అప్పికట్లకు పొన్నూరు అటుపైన్లు". ఇదీ తేటగీతి పద్యపాదమే!

ఒకసారి ఏదో పుస్తకమో, న్యూస్ పేపరో తిరగేస్తుంటే, ఒక పేరు కనిపించింది. "సామవేదము జానకీరామశర్మ". నామకరణమహోత్సవ సమయంలో వారి తల్లిదండ్రులు ఆలోచించారో లేదోగాని, ఇది తేటగీతి పద్యపాదమే! అట్లాగే "విష్ణుమొలకల వేంకట కృష్ణమూర్తి", "కొలనూతల వీరాంజనేయశర్మ" - ఇవి తేటగీతి పద్యపాదాలు. రాచకొండ సుబ్బరాయశాస్త్రి, తంగిరాల రామలింగమూర్తి, నాగసరపు పద్మనాభగుప్త, అర్వపల్లి వేంకటసుబ్బగుప్త_ ఇవన్నీ ఆటవెలది పద్యపాదాలు

ఒకరోజు బజారునుండి ఇంటికి వచ్చి, మా అమ్మను "నా చొక్కా ఉతికావా?" అని అడిగాను అమ్మ "ఏ చొక్కా? ఉతకలేదె! ఎక్కడవుంది?" అని తిరుగు ప్రశ్న వేసింది నా ఛందఃపరిజ్ఞానం గురించి వేరే చెప్పేదేముందిగాని, మా అమ్మకు గురు లఘువులుకూడా తెలియవు. నా ప్రశ్నను, మా అమ్మ తిరుగు ప్రశ్నను కలిపి చూడండి. కందపద్యంలో పూర్వార్ధం ఔతుంది.

"అమ్మా! సినిమా కెళతా" అని అమ్మతో అన్నా, "నాన్నా! ఎక్కడి కెళ్ళావ్?" అని నాన్నగారి నడిగినా, "అక్కా! నాకూ తేవా" అని అక్కయ్యను బ్రతిమిలాడినా, నాతో మాట్లాడమంటె నాకేం భయమా?" అని ధీమాగా అన్నా, అవన్నీ 'కందపద్యపాదాలే!

తేటగీతి, ఆటవెలది, కందాల గణాలలో ఒక సౌలభ్యం వున్నది. ఇంద్రగణాలంటే, నల, నగ, సల, భ, ర, త లలో ఏదైనా ప్రయోగించవచ్చును. సూర్యగణమంటే, న, హ లలో దేనినైనా వ్రాయవచ్చును. అంటె సౌలభ్యం కందానికీ వున్నది. అందులో చతుర్మాత్రగణం ఏదైనా (గగ, భ, జ, స, నల) ఉపయోగించవచ్చును ఇంత సౌలభ్యం వృత్తాలలో లేదు ఉత్పలమాల ఉన్నదనుకోండి. భగణం తర్వాత రగణమే ప్రయోగించాలి. ఈగణాలలో పద్యాన్ని

నడపటంవలన పద్యానికి గ్రాంథికరీతి వస్తుంది. వృత్తాలలో పూర్తి వ్యావహారిక రచన- అసలు కుదరదనికాదుగాని- తేటగీతి ఆటవెలదులలోలాగా కుదురదు, అంటే, మన నిత్యవ్యవహారంలో తేటగీతివంటి పద్యాలు నడచినట్లుగా, వృత్తాలు నడవవు.

అట్లా అని వృత్తాలలో వ్యవహారం పూర్తిగానడవదని భావించకూడదు మా మిత్రుడు మస్తాన్ రెడ్డిగారున్నారు మంచివాడు విశేషించిగొప్పకవి. ఒకరోజున మా అబ్బాయి బడినుండి వస్తూనే, "మస్తాన్ రెడ్డి మహాకవంట గద!" అన్నాడు. గౌరవసూచకంగా 'గారు' ప్రయోగించాలని వాడికి తెలియదు. అది వేరే విషయం ఎవరు చెప్పారురా? అని అడిగాను "మా మాష్టారు చెప్పారులే" అన్నాడు. నాకు ఆశ్చర్యం కలిగింది. వాడు చదువుతున్నది మూడవ తరగతి. వాడు చెప్పింది శార్దూల పద్యపాదం

* • •

మన నిత్య వ్యవహారంలో- నిజజీవితంలో, భౌతిక శాస్త్రం, రసాయనిక శాస్త్రం-అర్థిక శాస్త్రాలలాగానే, ఛందశ్శాస్త్రం కూడా పనిచేస్తుంటుంది ఈ విషయాన్ని గమనించి, శాస్త్రశ్రద్ధగా పరిశీలించినట్లయితే, మనం మాట్లాడుకొనే వాక్యాలలో ఎన్నెన్నో పద్యాలు కనిపిస్తుంటై ఆ సంగతిని మనం పసిగట్టినప్పుడు మనకు ఒకవిధమైన ఆనందం కలుగుతుంది

మనం ఎన్ని పనులు చేసినా, ఆనందం కోసమే గదా! మన మనుగడకు ఆధారభూతమైందిగూడా ఆనందమే! అసలు ఛందస్సు అనే పదానికి ఆనందాన్ని కలిగించేది అనేగదా అర్థం!!

• • •

# శ్రీపాద కవిసార్వభౌములు

—శ్రీ కె ఎస్ సత్యనారాయణమూర్తి

మ. రాజై రాజులనెల్లరం గెలిచి
రాష్ట్రించెన్ బ్రహ్మర్షియై
జేజేపెట్ట జగంబు సృష్టికిన్
బున సృష్టిన్ నిర్మించి వి
భ్రాజత్తేజముగొన్న కౌశికుని
గోత్రంబందు శత్రుత్రయం

బోధం జేసిన వేంకటాధ్వరిసుతుం డైన శ్రీ కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు రాజమండ్రిలో 'సుదర్శనభవనం'లో ఉంటూ 'నేను రాజమహేంద్రవరం వాణ్ణి' అని గుండెల మీద చెయ్యి వేసికొని చెప్పుతుండేవారు. సుమారు ఆరడుగుల పొడవు భారీవిగ్రహంతో దివ్యమైన ముఖవర్చస్సుతో నడచివెళ్ళుతుంటే ఎవ్వరైనా జోహారు లర్పించే మహావ్యక్తులువారు.

శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు 1866 సం॥లో వేదపండితులైన శ్రీ వేంకట సోమయాజులుగారి కుమారులైన శ్రీ వేంకట సోమయాజులుగారి కుమారులై జన్మించిరి విద్యాభ్యాసకాలంలో గురువుల వద్ద సంస్కృతాంధ్రభాషలు నేర్చిరేకాని విశ్వవిద్యాలయపు చదువులు లేవు బాల్యమునుండియూ కవిత్వము చెప్పుట నభ్యసించి కాలక్రమేణా పద్యకావ్యములు, నాటకములు, శతకములు, వచన గ్రంథములు, విమర్శనలు ప్రహసనములు సంస్కృత గ్రంథములు మొదలగునవి సుమారు 300 పైగా వ్రాసియున్నారు. అందుకొన్ని యింకను అముద్రితములే. ముఖ్యమైనవి శ్రీకృష్ణభారతము, శ్రీకృష్ణభాగవతము, శ్రీకృష్ణరామాయణము అనునవి వారి రచన బొబ్బిలియుద్ధ నాటకము స్టేజి నాటకముగా మంచిపేరు తెచ్చికొన్నది సంస్కృత లిపిలో మన ప్రథమ రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ గారి జీవిత చరిత్రము వ్రాసిరి. వారిపాండితీ ప్రతిభను గుర్తించి ప్రభుత్వమువారు 1937 సం॥లో "మహామహోపాధ్యాయ" బిరుదమునిచ్చిరి రూ, 116ల వార్షికముతో సత్కరించిరి ఆంధ్రాయూనివర్శిటీవారు ప్రథమముగా వీరికి 'కళాప్రపూర్ణ' బిరుదమును ఇచ్చిరి ఇవిగాక కవిరాజు, కవిసార్వభౌమ ఆంధ్రవ్యాస, అభినవ శ్రీనాథ, వేదవిద్యా విశారద అభినవ వాల్మీకి విశ్వకవి కవిబ్రహ్మ, మహాకవి అనే బిరుదములు ప్రజలవలన పొందిరి ఆత్మీయ పాండితీప్రతిభలకు ప్రశంశలుగా గుడివాడ పాలకొల్లు పట్టణములలో స్వర్ణాభిషేకములు జరిగినవి. అన్నవరం క్షేత్రంలో అప్పటి జమీందార్లు శ్రీ సత్యనారాయణ స్వామివారి దివ్యసన్నిధిలో సువర్ణపుష్ప పూజ జరిపించిరి ఇదివరలో ఆంధ్రకవితా పితామహులైన అల్లసాని పెద్దన్న గారికి శ్రీశ్రీ కృష్ణదేవరాయలవారు బహూకరించిన 'గండపెండెరము' వంటిది రాజమండ్రి పౌరులు సాహితీవేత్తల సమక్షములో శ్రీశాస్త్రిగారికి

పొరపెద్ది రాధాకృష్ణమూర్తి.
చింతలపాటివారి వీధి,
అరండల్‌పేట,
నరసరావుపేట.,
గుంటూరు జిల్లా.

(*.*)

(1937లో) 'గండపెండేరము' బహూకరించిరి బెజవాడ పాలూరు పట్టణములలో వారికి గజారోహణ ఉత్సవములు జరిగినవి అష్టావధాన శతావధానములు చేసి మహారాజులను రాజులను మెప్పించి వారివల్ల అనేక బహుమతులను పొందిరి. ఆంధ్రప్రదేశ ప్రభుత్వమువారు వీరిని ఆస్థానకవిగా (poet Laureatte) నియమించి గౌరవించిరి భారతదేశంలో సంస్కృత పండితులుగా మొదటిసారిగా ప్రమాణపత్రప్రదానముచేసి కేంద్రప్రభుత్వం వీరిని సత్కరించినది సుమారు 45 సంవత్సరముల క్రిందట రాజమండ్రి మునిసిపలు ఆవరణలో (1941 లో) వీరి శిలావిగ్రహము ప్రజలచే ప్రతిష్ఠించబడినది

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు గౌతమి, వందేమాతరం కలభాషిణి, మానవసేవ, వజ్రాయుధంలోనగు పత్రికలు నడిపించిభాషాసేవచేసి యున్నారు. ఇందులో 'గౌతమి' దినపత్రిక తెలుగు భాషలో మొదటి దినపత్రిక (గానుండెడిదట). రాజమండ్రిలో గౌతమీగ్రంథాలయం ప్రెసిడెంటుగా కాకినాడ ఆంధ్ర సాహిత్యపరిషత్ ప్రెసిడెంటుగా ఆంధ్ర సాహిత్య అకాడమీ సభ్యులుగాకొన్నేసి నాళ్ళుగా విధులను నిర్వహించిరి

శ్రీశాస్త్రిగారి గ్రంథములలో కొన్ని పద్యములను ఆంగ్లభాషలోనికి అనువదించి 'Lilies in the Lake' అనే పుస్తకముగా ప్రచురించి 'అవి శ్రీశాస్త్రిగారి కవితాశక్తిని మెఱుపులా స్ఫురింప చేస్తాయ'ని అన్నారు శ్రీ R M చల్లాగారు.

ఒరిస్సాలోని మయూర్భంజ సంస్థానాధీశులవారి ఆస్థానములో గొప్పపండితుల సమక్షములో సంస్కృత భాషలో శతావధాన మొనర్చి జయభేరి మ్రోగించి ఆస్థానపండితులచే ప్రశంసింపబడి సంస్థానపు తెల్లఏనుగుపై ఊరేగింపబడిన గౌరవం వారికి దక్కినది. ఇట్టి గౌరవం పొందిన వ్యక్తి ఆంధ్రసాహితీ చరిత్రలోనే లేరని శ్రీ శాస్త్రిగారి జీవితం ధన్యమైనదని ఒక మహావ్యక్తి వక్కాణించిరి

కవిసార్వభౌములకు సహపఠనశక్తి కలదు. ఒకరు పద్యములు చెప్పుచుండగా వారా పద్యములను సహపఠనములుగా చెప్పగల ప్రజ్ఞను ఈశ్వరుడు వారికి ఇచ్చియుండెను. ఇదివారి బుద్ధికి ప్రతిభ పాండిత్య ప్రకర్ష ప్రత్యేక అపూర్వలక్షణము ఇట్టి విద్యకలవారరుదు. ఇది పూర్వజన్మసంస్కారమే.

కవి సార్వభౌములు రచించిన గ్రంథములలో శ్రీకృష్ణభారతము ఒకటి. నన్నయ తిక్కనాది కవులు మూడు శతాబ్దములలో రచించిన ఆంధ్ర మహాభారతము వలె మూడుదశాబ్దాల కాలములో వ్యాసకృత సంస్కృతభారతాన్ని శ్రీకృష్ణభారతముగా తెలుగులోనికి అనువదించిరి. ఒక్క భారతమే కాక రామాయణాన్ని భాగవతాన్ని కూడా ఒక్కరే రచించారు. మూలానుసరణముగా చేయవలెననే అభిప్రాయంతో వ్యాసకృత భారతానువాదానికి పూనుకొన్నారని తెలుస్తున్నది. ఇంకా రామాయణాన్ని శ్రీకృష్ణ రామాయణంగా రచించారు పోతనామాత్యులు రచించిన ఆంధ్ర మహాభాగవతం వలె శ్రీకృష్ణభాగవతాన్ని మూలానుసరణముగా తెనిగించిరి ఇవిగాక అనేక స్వతంత్రరచనములు, కావ్యములు, నాటకాదులు ఏకధాటిగా రచించారు. మఱియు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నియామ్య నిర్వచనైకాదశాక్షరి అను శకుంతలా దుష్యంతుల కథను త,న,జ,డ,క,ర,గ,ల,ద,ట,ణ, అను 11 అక్షరములతో వ్రాసియున్నారు.

ఉ॥ గడియకు నూఱుపద్యములు
కల్పన సేయఁగ జాలియొంతయేఁ
బడునవధానముల్ సలుపు
వాఁడనయై కవిరాజ నామమున్
బడసి ప్రశంసకెక్కఁగ ప్ర
బంధములెన్నొ రచించు మించునే
నుడివెద కృష్ణమూర్తినని
నూత్న కవీంద్రు లెఱింగిరో నిటన్.

అని వారి కవితాశక్తిని గురించివారే చెప్పుకున్నారు

వారు చాలాపట్టుదలకలవ్యక్తి తమకు వ్యతిరేకముగా ఎవరైనా వ్రాసినా ప్రచురించినా మాట్లాడినా వారిమీద ధ్వజమెత్తి కోర్టులద్వారాగాని క్షమాపణల ద్వారాకాని మరొకవిధంగా గాని విజయం పొందేశక్తికలవారు.

శ్రీనాథకవిసార్వభౌములను గురువులుగా నెంచుకొని కవిత్వము చెప్పుటయేకాక ఆయన వలెనే రాజాస్థానములలో గౌరవములు పొందుట వ్యవసాయముచేసి నష్టపోవుట మొదలగు విషయములలో శ్రీనాథులవారికి శ్రీపాదవారికి జీవితాలలో చాలా సంబంధాలు ఉన్నట్లు తోస్తుంది. రాజమండ్రిలో ఉన్న సమకాలీన కవులలో ఒక్కొక్కరికి ఒక్కొక్క గుణం ప్రధానంగా ఉన్నదని, అట్టిగుణములన్నియు కవిసార్వభౌములలో మూర్తీభవించినట్లు కనుపడుతాయని వారి ఒక జన్మదినోత్సవ సభలో ఒకవ్యక్తి వ్యక్తపరిచారు. వారికి జాతియతి ద్వేషములు లేవు. పూర్వాచార పరాయణులైనను సమయానుకూలముగా ప్రవర్తించు నేర్పు కలవారు.

వారు అనేక గ్రంథములు రచించిరి. అందు పద్యకావ్యములు యెక్కువ. వారు రచించిన గ్రంథములను పరమేశ్వరునికి కూడా మహారాజులకు, రాజులకు, జమీందార్లకు వైశ్యశిఖామణులకు కృతులనిచ్చి

యున్నారు కృతులనిచ్చుటయే కాక కృతులను స్వీకరించి వారిని తగువిధముగ సత్కరించుటయు కూడ వీరిలో ఒక విశిష్టత. ఇట్టివారుండుటరుదు.

దానగుణం వారిలో ఒక ప్రత్యేకతగా చెప్పుకోనవచ్చును ప్రభుత్వ వారిచ్చిన ఇతరుల వల్లను లభించిన మెడల్స్ బహుమానాలు గండపెండేరమును తమ స్వంతముగా భావించలేదు అవి యన్నియు ఆంధ్రాయూనివర్సిటీకి బహూకరింపవలెనని వారి కోరిక ప్రకారము వారిచేత జయంతి ఉత్సవకాలంలో పుర ప్రముఖులు మంత్రులు పెద్దలు కవిపండితుల సమక్షంలో ఆంధ్రా యూనివర్సిటీకి అందజేయబడినవి ఆ గండపెండేరము మొదలగు వాటిని వారి ఫోటోలతోసహా వారి జన్మదినోత్సవసమయమున యూనివర్సిటీ లైబ్రరీలో ప్రతిసంవత్సరం (29 October) exhibit చేయుదురు

కవిసార్వభౌములుజీవించియున్న కాలములో 2 లేక 3 దినములు వారి జన్మదిన ఉత్సవములు ఘనంగా జరుగుచుండెడివి ప్రముఖపండితులు వేర్వేరు ప్రదేశముల నుండి వచ్చి ఉపన్యాసములు చేసెడివారు తిరువాత వారి ఆతిథ్య సత్కారములు అందుకొని పోవువారు మా అమ్మమ్మగారు శ్రీమతి వెంకట రత్నమ్మగారు.

ఆమె సహకారమును ఇచ్చెడివారు వారి మరణానంతరము మా తల్లిగారు (కవిసార్వభౌముల కుమార్తె శ్రీమతి కల్లూరి విశాలాక్షమ్మ) నేను ఈ జన్మదినోత్సవములను జరిపించెడి వారము 1965లో మూడు దినాలుగా జరిగిన శతజయంతి సభలలో కవులు, పండితులు పుర ప్రముఖులు మంత్రులు ప్రభృతులు అంజలులు ఘటించి శ్రీశాస్త్రిగారి పాండిత్యాన్ని ప్రశంసించి తెలియజేశారు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారు కూడ శ్రీపాద వారి శతజయంతి జరిపించి ప్రముఖుల చేత ఉపన్యాసముల నిప్పించిరి మా అమ్మగారి మరణానంతరము వారి దౌహిత్రుడ నగు నేను ఈ జయంతి ఉత్సవం ప్రతిసంవత్సరం రాజమండ్రిలో జరిపించుచున్నాను. ఇందులో ప్రముఖపండితులలో ఒకరికి సన్మానము జరిపించుట ఒక ప్రత్యేకత

ఇటీవలికాలంలో ఆంధ్రయూనివర్సిటీ వారు శ్రీకృష్ణభారతము శ్రీకృష్ణరామాయణముల మీద రిసెర్చి చేయుటకు అనుమతించగా రాజమండ్రి వాస్తవ్యులైన శ్రీ చేబోలు చిన్నసుబ్రహ్మణ్యకవిగారు 'కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి సాహిత్య పరిశీలన' అనే పేరుతో శ్రీకృష్ణభారతము మీద రిసెర్చిచేసినారు శ్రీకృష్ణరామాయణముమీద రిసెర్చి ఇంకా పూర్తికాలేదని తెలిసినది

సాహిత్యమే జీవితంగా జీవితమే సాహిత్యరంగంగా తొంబదిరెండేండ్లు పైగా జీవించి పెక్కురచనలొనర్చి పండితాలిపోయిన మహావ్యక్తి శ్రీశ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు అహో ధన్యజీవి! ప్రబంధ యుగంలో ఆఖరుకవిగా ఒక వెలుగు వెలిగి ప్రభుత్వ ఆస్థానకవియైన శ్రీ కవి సార్వభౌములు 1960 సంలో మరణించినప్పుడు వారికి రాజలాంఛనాలతో అంత్యక్రియలు జరిగినవి శాస్త్రిగారి శరీరము పంచభూతములలో కలసిపోయినను సాహిత్యములో వీరి పేరు చిరస్థాయిగానిలిచిపోగలదని భావిస్తున్నాము.

కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు మా తాతగారని చెప్పుకొనుట మా పూర్వజన్మ సుకృతమే అని నావిశ్వాసము వారికి మా జోహార్లు.

ఇటీవలికాలంలో రాజమండ్రిలో ఒక జయంతి సభలో శ్రీకవిసార్వభౌములను ఆశువుగా ఈవిధంగా కీర్తించినారు.

మ॥ 'ఒక వన్నెయ్యయు నొక్క
తిక్కనయు మా
త్యుండొక్కరొక్కన్న తా
నొక శ్రీనాథుడు నొక్క పోతనయునీ
యుర్వం బెదంబానితా
నకటంబుగ కృష్ణమూర్తి మహానీ
యాకారముల్ దాల్చి యాం
ధ్రిక సేవల్ పొనరించి రంచు దలతున్
శ్రీపాద వంశోన్నతున్'

(All India Radio వారి సౌజన్యముతో)

* * *

కె ఎస్ సత్యనారాయణమూర్తి
14-36-8, కృష్ణనగర్
విశాఖపట్టణం-2

0 0

## పట్టా ప్రదానం

గుంటూరు ఎ. సి. కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేస్తున్న శ్రీ సి. వి. కె. వై. యస్. శర్మగారికి నాగార్జున విశ్వవిద్యాలయంవారు ఎం. ఫిల్. పట్టాని ప్రదానం చేశారు.

"బిల్హణీయము - కావ్యానుశీలనము" అనే అంశాన్ని గురించి డా॥ నేతి అనంత రామశాస్త్రిగారి పర్యవేక్షణలో పరిశోధనచేసి సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించినందుకుగాను వారికి ఈ పురస్కారం లభించింది.

సంస్కృతమున బిల్హణుడు వ్రాసినట్లుగా చెప్పబడుచున్న బిల్హణీయానికి తెలుగులో అనేక అనువాదాలు వచ్చినాయి. శ్రీ శర్మగారు కొత్తపల్లె (చిత్రకవి) సింగరార్యుని బిల్హణీయాన్ని తమ పరిశోధనాంశంగా తీసుకున్నారు. కావ్యం, నాటకం, యక్షగానం, నృత్యనాటిక, ఖండకావ్యం లాంటి వివిధ ప్రక్రియలలో వచ్చిన బిల్హణీయాలనుగూడా శర్మగారు తమ సిద్ధాంత వ్యాసంలో పరిచయం చేశారు

సింగరార్యుని కవితా వైశిష్ట్యాన్ని అనేక కోణాలనుండి పరిశీలించి శర్మగారు ఈసిద్ధాంతవ్యాసాన్ని రచించారు

యామినీ బిల్హణుల ప్రణయ వృత్తాంతంలో కొపవాదానికి గురైంది. శర్మగారు మన ప్రాచీన సాహిత్యంనుండి అనేక వృత్తాంతాలను ఉదాహరిస్తూ వారి ప్రణయం సమంజసమేనని సోదాహరణంగా నిరూపించారు.

సింగరార్యుడు క్రీ॥ శ॥ 1700- 800 సం॥ల మధ్యవాడని నిర్ణయిస్తూ నివాసం, గృహనామం, బిరుదు, మతములగూర్చి సమర్థవంతంగా కూడ విపులీకరించారు.

.. .. .

## ప్రయాణపు చివరిగట్టున...

—శ్రీ వంగుటొట్ల

ఈ రంగుల ప్రపంచంలో
నిత్యం దర్శించే దృశ్యాలు
అశాశ్వతాలు!
ఈ జీవిత నాటకంలో
మన పాత్ర క్షణికం!
కానీ దోస్త్
అనురాగాద్వేషాలకు
గుండెలో గుడికట్టి
పగతో, ప్రతీకారంతో
ఎదుటివాడి రక్తాన్ని కళ్ళచూస్తున్నావ్!

* * *

వాళ్ళు ఏడుస్తుంటే
నువ్వు తృప్తిగా నవ్వుకొంటున్నావ్
వాళ్ళు నవ్వుతుంటే
చూసి నువ్వేడుస్తున్నావ్!
ఈ అనురాగాద్వేషాలు
పతనానికి పునాది దోస్త్!

అధర్మపథంలో
కంప్యూటర్ వేగంతో
నువ్వు ముందుకు సాగిపోతున్నావ్
కానీ దోస్త్
ప్రయాణపు చివరిగట్టున
మృత్యువు పొంచి ఉంటుందనే
వాస్తవాన్ని మాత్రం మర్చిపోకు!

0—0

